

‘రాయలసీమ కవిరత్నం’

శ్రీ జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

కార్యదర్శి, ‘పింగళి సూరన సారస్వత సంఘం’

నంద్యాల, కర్నూలు జిల్లా

# చైతన్య కవిత

*There are only three things*
*in the world.*
*One is to read poetry;*
*another is to write poetry;*
*and the best of all is*
*to live poetry*

*-Rupert Brooke*


సంపాదకుడు
ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

# కందీల్

- ఆశారాజు

షామియానా వేస్తే ఎట్లాగుంటుంది
సాయంత్రం గూడా అట్లాగుంది!
తాటిచెట్టుకు అడ్డంగా బండిని నిలబెట్టారు,
మైదానంలో ఎద్దుల్ని వదిలేశారు,
గడ్డిలో ఎంత మధురమైన సంగీతముందో
పశువులు మేస్తున్నప్పుడు వింటేనే తెలుస్తుంది.
ఇంద్రధనుస్సులు ఆకాశంలో లేనపుడు
చిన్నపిల్లల కళ్ళల్లో దాక్కుంటాయేమో,
మూడు నాలుగేళ్ళమ్మాయి
రంగుల పేలికలతో బండిని అలంకరిస్తోంది.
ఎక్కడా నెలవంక జాడలేదు,
ఏ ఒక్క చిన్నతారైనా తోడులేదు,
లాంతరు వెలిగించి బండికి తగిలించారు,
ఎఱ్ఱని బొట్టు దిద్దుకున్న
ప్రౌఢముఖమంత అందంగా కనిపిస్తోంది రాత్రి.
మూడు రాళ్ళను చేర్చి,
మధ్యలో మంట రాజేసి,
బండి చక్రం చాటున ఆమె రొట్టెలు కాలుస్తోంది.

బంజారా దుస్తుల్లో మంట ముందు కదులుతున్న
ఎఱ్ఱరాతి శిల్ప సౌందర్య మనిపిస్తోంది!
రొట్టె వాసనకి లోకమంతా
ఆమె ముందు మోకరిల్లింది!
ఎప్పుడు తెల్లవారిందో
ఎడ్ల మెడలోని గంటలు నిద్రలేపాయి.
ఇటు ప్రక్కన లాంతరు ఆరిపోయి
అటు ప్రక్కన ఆకాశంలో వెలిగింది!
షామియానాని పీకేసి ఆరవేస్తే ఎట్లాగుంటుంది
ఉదయం నేల కూడా అట్లాగుంది!
గాజుల శబ్దం, మువ్వల శబ్దం,
బండి చక్రాల ఫిడేలు గీతం!
బండీ బాటా మాట్లాడుకుంటున్న శబ్దం!
తండ్రి పగ్గాలు అదిలిస్తుంటే
చిన్నపిల్ల పిచుకల్ని పిలుస్తోంది.
తల్లి సిగలోంచి రాలిన పువ్వుకోసం
గాలీ దుమ్మూ పోట్లాడుకుంటున్నాయి!
బండి వెళ్ళిపోతుంటే
బాట ప్రక్కన తాటిచెట్టు చిన్నబోయింది!

(''కందీల్'' అంటే ''లాంతరు''.
ఇటీవల వెలువడిన ''సారంగి'' అనే కవితా సంపుటి నుండి)

# చైతన్య కవితా వేదిక

నెం. 40/12-7, 'సౌరభ', (మేడపైన), 22వ క్రాసు,
గోవిందరాజనగర్, విజయనగర్, బెంగళూరు - 560 040

అధ్యక్షులు–మహారాజ పోషకులు – 'దాన చింతామణి'
శ్రీ దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులు

గౌరవాధ్యక్షులు : శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి)
డా॥ నండూరి రామకృష్ణమాచార్య
డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ (శేషేంద్ర)
డా॥ సి. నారాయణ రెడ్డి (సినారె)
శ్రీ ఏరాసు అయ్యపురెడ్డి
డా॥ జె. బాపురెడ్డి, ఐ. ఎ. ఎస్. (రిటైర్డు)

ఉపాధ్యక్షులు : శ్రీ బుల్లా సుబ్బారావు, ఐ. ఎ. ఎస్.
శ్రీ సకలా నరసింహులు (శ్రేష్ఠి)
శ్రీ కె. పి. రావు
శ్రీ వై. వి. వెంకటేశ్వరరావు
డా॥ శ్రీపాద కృష్ణమూర్తి

ప్రధాన కార్యదర్శి : ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు (తంగిరాల)

సహకార్యదర్శులు : డా॥ దివాకర్ల రాజేశ్వరి
శ్రీమతి అంబికా అనంత్
శ్రీ న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)
శ్రీ వై. ముకుంద రామారావు

కోశాధికారి : శ్రీ తంగిరాల శ్రీనాథ కవిసార్వభౌమ

# చైతన్య కవిత

## 33

విషునామ సంవత్సర వసంతం
April 2001

సంపాదకుడు

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

సహాయకులు

డా॥ దివాకర్ల రాజేశ్వరి
అంబికా అనంత్
న్యాయపతి శ్రీనివాసరావు (వాసు)
వై. ముకుంద రామారావు


చైతన్య కవితా వేదిక
40/12-7 "సౌరభ" (మేడపైన)
22వ క్రాసు, గోవిందరాజ నగర్, విజయనగర్
బెంగుళూరు - 560 040

**CHAITANYA KAVITA,** an anthology devoted to Modern Telugu Poetry and Published by Chaitanya Kavita Vedika, 40/12-7 "Saurabha" (Upstairs), 22nd Cross, Govindaraja Nagar, Vijayanagar, BANGALORE - 560 040, April- 2001.

Pp. 160

ముఖచిత్రం : ''పద్మశ్రీ'' డా॥ సురగాలి తిమోతి జ్ఞానానంద కవి, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా.

అట్టవెనుక : కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమతి పొందిన ప్రసిద్ధకవి డా॥ ఎన్. గోపి, ఉపాధ్యక్షులు, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

అక్షరాలంకరణ : ఆచార్య పి.సి. నరసింహారెడ్డి
కళాప్రపూర్ణ శ్రీ 'బాపు'

వెల : విడిప్రతి : రూ. 20-00
జీవిత సభ్యత్వం : రూ. 500-00
పోషక సభ్యత్వం : రూ. 1,000-00
విదేశాలలో : $100

**For Copies** : **Prof. T.V. Subba Rao** M.A., Ph.D.
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040
Ph.: 080-330 59 02

**M/S. Visalaandhra Book House**
4-1-435, Bank street, Hyderabad - 500 001
and all its Branches.

**DTP and Printed By** : **Sree Laxmi Art Printers**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Ph: 330 00 93

# అంకితం

**19-2-2001** నాడు
సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం చేసుకున్న
ప్రముఖకవి, ప్రయోగవాది,
చలనచిత్ర దర్శకుడు, నిర్మాత,
మా చైతన్య కవితా వేదిక గౌరవాధ్యక్షులు,
పద్దెనిమిదేళ్ళ వయస్సులోనే
''డజను ఫిడేలు రాగాలు'' ఆలపించిన
''పఠాభి''గా ప్రసిద్ధి కెక్కిన
**శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డిగారికీ**
మరియు
**29-7-2001** నాడు సప్తతి మహోత్సవం చేసుకున్న
ప్రసిద్ధ కవి శేఖరులు, జ్ఞానపీఠ బహుమతి గ్రహీతలు,
'పద్మభూషణులు', రాజ్యసభ సభ్యులు అయిన
''సినారె'' గా ప్రసిద్ధి కెక్కిన
**డా॥ సి. నారాయణరెడ్డిగారికీ**
ఆయు రారోగ్య సంపత్ పరంపరాభివృద్ధిని ఆకాంక్షిస్తూ...
అనేక నమస్సులతో...

-తంగిరాల వెంకట సుబ్బారావు

## వేయి పున్నమి రేలు

వాయులీనపు పాట
వజ్రాల 'పన్' మాట
కవిత 'పతాభి' కోట
ఓ కూనలమ్మ!

భావ కవితకు మలుపు
పాత పాటకు సలుపు
వాస్తవికతకు గెలుపు
ఓ కూనలమ్మ!

వేయి పున్నమి రేలు
వెలిగె వెన్నెల జాలు
'కయిత దయిత'కు పూలు
ఓ కూనలమ్మ!

## వసంత సప్తతి

మధుర కవితల జల్లు
మానవత హరివిల్లు
మన 'సినారె' కు చెల్లు
ఓ కూనలమ్మ!

మాట మల్లెల హోయి
పాట వెన్నెల రేయి
బాట వెలుగులు వేయి
ఓ కూనలమ్మ!

ఏండ్లు డెబ్బది నిండె
ఎఱుక పంటయు పండె
చదువు తల్లికి గుండె
ఓ కూనలమ్మ!



'అప్పాజోస్యుల-విష్ణుభొట్ల ఫౌండేషన్' (అమెరికా) వారి
సాహిత్య పురస్కారాన్ని అందుకుంటున్న ''పఠాభి'' గారు
నెల్లూరు, జనవరి 2000




'డా॥ సి. నారాయణరెడ్డి సమగ్ర సాహిత్యం' - 17, 18 సంపుటాల ఆవిష్కరణ సభ, బెంగుళూరు

తంగిరాల, చిన్నస్వామిరాజు, రాధాకృష్ణరాజు, కర్ణాటక గవర్నరు, సి.నా.రె., ఆదికేశవులు



కర్ణాటక రాష్ట్ర గవర్నరు శ్రీమతి వి. యస్. రమాదేవిగారికి 'చైతన్య కవిత'ను తన ఇతర గ్రంథాలను బహూకరిస్తున్న ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు (ప్రక్కన ఉన్నది శ్రీ దాసరి అమరేంద్ర)




'శ్రీరస' సాహిత్య వసంతోత్సవాలు, బెంగుళూరు 25-3-2001

అంబిక, అనంతనారాయణ, ప్రొద్దుటూరి ఎల్లారెడ్డి, తంగిరాల, శలాక, శివనగౌడ, పి.యస్. సుబ్రహ్మణ్యం

# వసంత కోకిలలు


కందీల్ - ఆశారాజు 2

అంకితం 7

వేయి పున్నమి రేలు, వసంత షష్ఠి 8

సాహిత్యాభిరుచి - ప్రొఫెసర్ యస్.టి. నరసింహాచారి 13

ప్రగాఢ సంతాపం 19

సవరణ 20

ఫిడేలురాగాల డజన్ 'పఠాభి' గారితో అరవయి నాలుగు వసంతాల

వెనుకటి ముచ్చట్లు - కె.యస్. రామచంద్రమూర్తి 21

పద్మశ్రీ డా॥ యస్.టి. జ్ఞానానందకవి జీవితం - సాహిత్యం

- దార్ల వెంకటేశ్వరరావు 25

My Creative Experience - Dr. N. Gopi 33

పల్లెనుండి ఢిల్లీ దాకా ఎదిగిన డా॥ ఎన్. గోపి కవిత

- డా॥ ఎండ్లూరి సుధాకర్ 40


## వచన కవితలు:


భీవండిలో తెలుగుదీపం - డా॥ ఎన్. గోపి 47

నాకూ నన్నయకూ నడుమ రాయబారి గోదావరి

- డా॥ ఆవంత్స సోమసుందర్ 49

వీడ్కోలు - వాడ్రేవు చినవీరభద్రుడు 54

దూరం - వై. ముకుంద రామారావు 55

Flat No. 505 - మునిపల్లెరాజు 56

యుద్ధం - డా॥ దిలావర్ 58

ఉడతా భక్తి - యస్. మునిసుందరం 59

చిరకాల దర్శనం - కొంపెల్ల రామకృష్ణమూర్తి 60

పర్సనల్ 'లా' - మహమ్మద్ షంషాద్ 61

డా॥ రాజేశ్వరీ దివాకర్ల కవితలు

1) తీపి తీతువు 63

2) పోలిక 63

3) సప్తతి - సమగ్రాకృతి 64

చూడాలని ఉంది - 'కొల్లూరి' 65

నగరం మీద చందమామ - 'భానుశ్రీ' 67

వలస పోయిన మనిషి - అడిగోపుల వెంకటరత్నమ్ 69

త్యాగం ఆవిరవుతున్న వేళ... - అద్దంకి శ్రీనివాస్ 70

రెండు కవితలు - ఆచార్య ఎస్జీడి. చంద్రశేఖర్

1) చివరికది 71

2) కాకిగూళ్ళు 71

తీయటి మాయ - అంబికా అనంత్ 72

కోణార్క్ - యస్. ఆర్. పృథ్వి 73

నాడీనాళం - డా॥ శిరీష 76

పాట - 'సుపాణి' 77

సీతా సుధాకర్ కవితలు

1) యథార్థం 79

2) సందేహం 79

3) ఇదేనా న్యాయం? 80

వి. నాగలక్ష్మి కవితలు

1) ఈ తరం బాల్యం 81

2) గడ్డి పోచలు నీళ్ళోసుకున్నాయి 82

ఆమె - పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం 82

కొబ్బరి చెట్టు - బులుసు వేంకటేశ్వర్లు 85

నీది శుభదృష్టి ప్రియురాలా! - కె. కిశోరుబాబు, కె. అశోకుబాబు 85

నిత్య బాల్యమై - యశశ్శ్రీరంగనాయకి 86

సంద్రం - 'జాహ్నవి' 87

భూకంపం - అల్లంరాజు కామేశ్వర శర్మ 89

రెండు కవితలు - మేడిచర్ల సూర్యప్రకాశరావు

1) వెలుతురు పిట్టలై 90

2) ఇసుక రేణువై 90

విహగరాణి - ఆచంట హైమవతి 91

సానుభూతితో పరాభవించక ..... - చిటిప్రోలు వేంకటరత్నం 92

సిస్టరమ్మ - ఎన్. ఈశ్వరరెడ్డి 95

గాయం చేసిన గానం - అనంత వెంకటేశన్ 96

మందారమాల - ఆచార్య శలాక రఘునాథ శర్మ 97

రెండు గజళ్ళు - డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు 99

తెలుగమ్మ పాట 101

హైకూలు - భద్రాచలం శశితేజ్, డా॥ యస్. బషీర్ 102

ప్రకృతి ఒడిలో (హైకూలు) - ఆసు రాజేంద్ర 103

## పద్య కవితలు:

గోదావరి పద్యాలు - డా॥ యు. ఏ. నరసింహమూర్తి 107

కవిత్రయ సమారాధన - డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ 110

మా తెనుగుకైత - ఆకుండి రామశర్మ 111

ఆ నలుగురికి... - డా॥ పంపన సూర్యనారాయణ 112

మధుహేల - అల్లంరాజు కామేశ్వర శర్మ 113

వినతి - బులుసు సోమన్న 114

మధురస్మృతికి మృతి ఉండదు - డా॥ మన్నవ భాస్కరనాయుడు 116

హత్య - ఆచార్య ఎం. కులశేఖరరావు 117

వృషా! మృషాభిలాషముల్ - జి. సుబ్రహ్మణ్యశాస్త్రి 118

విషు - వృష పరామర్శ - డా॥ మల్లేల గురవయ్య 121

'వృష' వర్షానికి స్వాగతోత్పలాంజలి - విద్వాన్ పణతుల రామేశ్వరశర్మ 122
సంసార బాధలు - చిలకల వెంకటసుబ్బారెడ్డి 123
ఆమని ... ఏమని? - 'శతావధాని' కొండపి మురళీకృష్ణ 124
అవధాన కవిత - అల్లంరాజు కామేశ్వరశర్మ 124
మల్లీ! ఓ మల్లీ!! - జి. సుబ్రహ్మణ్యశాస్త్రి 126

## అనువాద కవితలు

పాకిస్తానీ స్త్రీవాద కవితలు (ఆంగ్లం) - అంబికా అనంత్ 129
కళాకారుడి కొడుకు (ఒరియా) - కుంత కుమారి సాబాత్
అనువాదం: వెల్దుర్తి హర్షవర్ధన్, వై. ముకుందరామారావు 133
వేరే ఊళ్ళో (కన్నడం) - అగ్రహారం కృష్ణమూర్తి
అనువాదం: తెన్నేటి రాజశ్రీమీనలోచని 135
నన్ను అంటరానివాణ్ణి చేసిన ... (కన్నడం) - మూడ్నాకూడు చెన్నస్వామి
అనువాదం: తెన్నేటి రాజశ్రీమీనలోచని 137
వైరాగ్యం (ఆంగ్లం) - అలెగ్జాండర్ పోప్
అనువాదం: యరమాక ఆదిశేషారెడ్డి 138

## ఆంగ్ల కవితలు:

Dusk and Dawn - Dr. palvai (Kodur) Padma (U.S.A.) 139
The King of Dark Chamber - Dr. C. Satyanarayana 141
So says 'Adi Stree' - Nuggehalli Pankaja 143
Divine Gift - Lakshmi Kathyayini 145
The Angle - P. Sanjay 145
The Smiling Buddha - Kuldip Salil 146
విపులాచ పృథ్వీ - 'సౌభాగ్య' 148
సాహిత్య వార్తలు - రాజేశ్వరి, అంబిక 153
వృష సాహిత్యాశంస! - జి. సుబ్రహ్మణ్యశాస్త్రి 158
సాహిత్య వసంతోత్సవ సంరంభ మాలిక - జి. సుబ్రహ్మణ్యశాస్త్రి 159

## అతిథి సంపాదకీయం:

# సాహిత్యాభిరుచి

–ప్రొఫెసర్ యస్. టి. నరసింహాచారి

సాహిత్యాభిరుచిని గురించి రెండు రకాలుగా ఆలోచించవచ్చు. 1. రచయిత అభిరుచి. దేశకాలాలు, రచయిత స్వభావాన్ని బట్టి యిది మారుతూ వుంటుంది. 2. గృహీత (ప్రేక్షకుడు, శ్రోత, పాఠకుడు) అభిరుచి. దీనిని బట్టి రచన స్వీకరించి ఆనందించటమో లేక తిరస్కరించటమో జరుగుతుంది. గృహీత అభిరుచి కూడా దేశకాల పరిస్థితులు, వ్యక్తి స్వభావాన్ని బట్టి యుగానురూపంగా మారుతూవస్తుంది. రచయిత రచనలో గృహీత అభిరుచిని ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మనస్సులో పెట్టుకోకపోతే ఇద్దరి మధ్యా భావాత్మకమైన సంబంధం ఏర్పడి ఆస్వాదన జరగదు. మతపరమైన సాహిత్యంలోనూ, సామ్యవాద సాహిత్యంలోనూ రచయిత ప్రత్యక్షంగా గృహీతను మనస్సులో పెట్టుకొని రచన చేస్తాడు. తమ ఆనందం కోసమే వ్రాస్తున్నామనే రొమాంటిక్ కవులు కూడా వ్రాసేటప్పుడు పాఠకుని గురించి ఆలోచించకపోయినా తరువాత వారు చదివి, ఆనందించి, మెచ్చుకోవాలనే ఆశిస్తారు. రచనాత్మక ప్రక్రియలో పాఠకుని లేక ప్రేక్షకుని అభిరుచి అడ్డుకాకూడదని భారతీయ ఆలంకారికులు వారు సుమనస్, సామాజికుడు (భరతముని), సహృదయుడు (అభినవగుప్తుడు), రసికుడు (ధనంజయుడు) ఆదేశించారు. అంటే అనుకూలమైన మంచి మనస్సుతో, సామాజిక సంస్కారితతో, సహృదయతతో, రసగ్రహణశక్తితో రచన చదవాలని వారి అభిప్రాయము. కాని రచయిత-గృహీతల మధ్య భావసామ్యం లేకపోతే పాఠకుడు తన అభిరుచిని దాటి సహృదయతతో రచన రసానుభూతి పొందగలుగుతాడనేది జటిలమైన ప్రశ్న. ఈ సందర్భంలో రాజశేఖరుడు యిద్దరూ జీవితంలో భావస్పందన (భావయిత్రీ ప్రతిభ) సమానంగా పొందుతారనీ, రచయితలో రచనా శక్తి (కారయిత్రీ ప్రతిభ) కూడా వుంటుందనే అభిప్రాయము వెల్లడించాడు. ప్రాచీనకాలంలో కవి, శ్రోతలు ఏ కులంవారైనా వారి అభిరుచులు ఒకే విధంగా ఉండేవి. ధర్మం, శౌర్యం, ప్రేమ, నీతికి సంబంధించిన భావాలలో పెద్ద తేడాలు ఏవీ లేవు. ఒకే ఉన్నత వర్గానికి చెందినవారి సంస్కృతి, అభిప్రాయాలు, అభిరుచి సమానం కావటంచేత రచనతో శ్రోత భావతాదాత్మ్యం పొందగలిగేవాడు. ఇదే రాజశేఖరుని దృష్టిలో సమానమైన భావనాశక్తి.

దేశకాలాలను బట్టి సాహిత్యాభిరుచిలో భిన్నత్వం గోచరిస్తుంది. పాశ్చాత్యుల దృష్టిలో భారతీయుల సంస్కృత సాహిత్యంలో అతిశయోక్తులు, కల్పనలు, ఆదర్శాలు ఎక్కువ. ప్రకృతి అనుకూలంగాలేక జీవితం పోరాటం కావటం చేత వారి సాహిత్యం యథార్థోన్ముఖమైంది. మన దేశంలో సస్యశ్యామలమైన ప్రకృతి ఒడిలో సుఖశాంతులు, ఆనందం అనుభవిస్తూ భారతీయ కవులు ఆదర్శ లోకాలలో అపూర్వమైన, సౌందర్యాన్ని, భావానుభూతినీ, ఆధ్యాత్మికమైన అనుభవాలనూ వర్ణించారు. దేశ చరిత్రలు - సాహిత్యాలు ఒకటి కావు. భౌగోళిక స్థితిని బట్టి సాహిత్యాభిరుచి వేరు వేరు విధాలుగా ఉంటుంది. ఇక సాహిత్యంలో కాలం తెచ్చే మార్పులు అందరికీ తెలిసినవే. ప్రేమను తీసుకుంటే ప్రాచీనకాలంలో అది ధర్మబద్ధమైంది. మధ్యయుగాలలో అది శృంగార విలాసాలుగా మారింది. ఆధునిక కాలంలో ప్రేమ మానసికమైన భావోద్విగ్నత. కొన్ని సందర్భాలలో అది ఇంద్రియాల అనుకూలమైన మధురానుభూతి మీద ఆధారపడి వుంటుంది. వ్యక్తి స్వభావగతమైన అభిరుచి స్వరూపం, సమస్యలు గురించి విపులంగా తరువాత చర్చిద్దాం. ప్రస్తుతం ముఖ్యంగా ఆలోచించవలసిన విషయం, సాహిత్యంలో అసలు అభిరుచే లేకపోతే, వ్యక్తి మనస్సు భావాలకూ, కల్పనలకూ స్పందించకపోతే సాహిత్యమంతా అభూతకల్పనగా అబద్ధాల పుట్టగా కన్పిస్తుంది. బుద్ధిజీవులు సాహిత్యంలో సత్యాన్ని చూడలేరు. వేదాంతంలోనే వారికి జీవిత సత్యం కన్పిస్తుంది. కాని వైజ్ఞానికులు వేదాంతంలో కూడా సత్యాన్ని అంగీకరించరు. అది తర్క ప్రయోగాల ద్వారా పరీక్షించి ప్రతిపాదించిన తథ్యాత్మకమైనది కాదు.

వ్యక్తి సాహిత్యాభిరుచి ఏ విధంగా మారుతూ వస్తుందో టి.యస్. ఇలియట్ ఒక వ్యాసంలో వివరించాడు. చిన్నపిల్లలు జీవితంలో వైషమ్యాలకూ, సంఘర్షణలకూ, బాధలకూ దూరంగా వుంటూ కల్పనాలోకాలలో విహరిస్తారు. అందువల్ల వారిని పాటలు, వీర సాహస గాథలు, రాజకుమారుల కథలు, దివ్యలోకాల అప్సరసల వృత్తాంతాలు, జంతువుల విచిత్ర స్వభావాల కథానికలూ ఆకర్షిస్తాయి. యవ్వనంలో ప్రేమగీతాలలో భావోద్విగ్నత, కల్పనలు, అవాస్తికమైన కాల్పనిక ఆదర్శాలు ఎక్కువగా వారి మీద ప్రభావం చూపుతాయి. తరువాత ప్రౌఢావస్థలోనే సంతులితమైన (Balanced) సాహిత్యాభిరుచి వికసిస్తుంది. బుద్ధి పరిణతి చెంది, జీవితంలో విలువల స్థానం, క్రమం తెలుసుకొని వ్యక్తి చదవటానికి సరియైన సాహిత్యం ఎన్నుకుంటాడు; చదువుతున్న సాహిత్యం యొక్క సరియైన విలువ తెలుసుకుంటాడు; మనస్సుతో పాటు సాహిత్యాభిరుచి కూడా పరిపక్వ స్థితికి చేరుతుంది. సాహిత్యం అంటే ఏమిటి, మంచి

సాహిత్యం ఏది, ఆ మంచి ఎందులో వుంది, దానికి కారణం ఏమిటి, ఆ మంచిని తెలుసుకోవడం ఎట్లా అనే విషయాలు అర్థం అయినాకే సాహిత్యాభిరుచి సరియైన స్థాయికి చేరుకుంటుంది.

సాహిత్యాభిరుచి స్వరూపాన్ని మూడు కోణాలనుంచి విశ్లేషించి అర్థం చేసుకోవచ్చు. దానివల్ల మూడు దిశలలో విభిన్నమైన విశేషాలు తెలుస్తాయి. వాటి సమష్టి స్వరూపమే సాహిత్యాభిరుచి. ఆ కోణాలు: సౌందర్య శాస్త్రం, మనస్తత్వ శాస్త్రం, సామాజిక సాంస్కృతిక అధ్యయనం. సాహిత్యంలో అభిరుచి అంటే సాధారణమైన అర్థం సాహిత్యం వైపు ఆకర్షణ. సౌందర్యశాస్త్రంలో అభిరుచి తాత్పర్యం సౌందర్య భావన (Contemplation of beauty). ఈ భావన లౌకికమైన అనుభూతి భిన్నమైంది. వ్యక్తి మనస్సులోని కల్పనా (Imagination), భావనలు (feelings), ఆలోచనలు (Thoughts) మొదలైన శక్తులన్నీ కలిసి సమరస భావంతో ఆనందాన్ని కలిగిస్తాయి. మానసిక శక్తులు విభిన్న దిశలలో క్రియాశీలమైనప్పుడు మనస్సు ఏకోన్ముఖం కాక సంపూర్ణమైన ఆనందాన్ని కలిగించదు. ఒకొప్పుడు అవి అల్లకల్లోలం కూడా కావచ్చు. కొంతమంది ఆధునిక రచయితలు ఈ విధంగా మనస్సును మథించటమే సాహిత్య లక్ష్యమనేవారు కూడా వున్నారు. సౌందర్యాభిరుచివల్ల కలిగే అనుభూతి సార్వజనీనమైనది. కాని దేశకాల పరిస్థితులవల్ల, వ్యక్తి స్వభావాన్ని బట్టి దానిలో కొన్ని తేడాలు, అనుభూతి తీవ్రతలో కొంత హెచ్చు తగ్గులు ఉండవచ్చు. రసం, సౌందర్యం, వాటి అనుభూతిని గురించి భారతీయ, పాశ్చాత్య దార్శనికులు ఎన్నో సిద్ధాంతాలు ప్రతిపాదించారు. దార్శనిక దృష్టితో అభిరుచిని గురించిన చర్చ అంతగా జరగలేదు. అది ఎట్లా ఏర్పడుతోంది. జన్మజన్మాంతర సంస్కారాలు, అర్జిత సంస్కారాలు ఏ విధంగా సమన్వయం పొంది, దానికి ఒక రూపు ఏర్పడుతోంది మొదలైన విషయాలు దార్శనిక సిద్ధాంతాల ఆధారంగా చర్చిస్తే కొన్ని కొత్త విషయాలు తెలుసుకోవచ్చు. అది సౌందర్యాభిరుచికి భిన్నమైన నాలుగవ కోణమవుతుంది.

మనస్తత్వ దృష్టితో సాహిత్యాభిరుచి సాహిత్యోన్ముఖమైన మానసిక భావం; తదనుకూలమైన ప్రతిక్రియ. ఈ భావం లేక ప్రతిక్రియ వ్యక్తి కల్పన, భావన, ఆలోచనలమీద ఆధారపడి వస్తు దృక్పథాన్ని (attitude towards the object) నిర్ధారిస్తుంది. ఆలోచనా దృష్టి ఎక్కువైన బుద్ధి జీవులలో కల్పనాశక్తి, భావస్పందన తగ్గిపోయి వారు అంతగా సాహిత్యోన్ముఖులు కాలేరు. సృజన ప్రక్రియ, కావ్యానుభూతి, పాఠకులమీద సాహిత్య ప్రభావం, ఒకే కవితమీద క్లాసులో సాహిత్య విద్యార్థుల వివిధ

అభిప్రాయాలు మొదలైన విషయాల మీద మనస్తత్వవేత్తలు ఎన్నో సైద్ధాంతిక ప్రయోగాత్మకమైన పరిశోధనలు చేశారు. వీటివల్ల రచయిత-పాఠకుల అభిరుచులు, రచన-అనుభూతులు మీద వాటి ప్రభావము తెలుస్తుంది. మనోవిశ్లేషణ (Psyco-analysis) లో ఇంకా లోతులకు వెళ్ళి, వ్యక్తమైన మనస్సే కాకుండా, అవ్యక్తమైన మనస్సు, రెండింటినీ అనుసంధించే ఉపచేతన, సాహిత్యాన్ని ఏ విధంగా ప్రభావితం చేస్తాయో, పాఠకుని అభిరుచిని ఏ విధంగా మలచుతాయో కూడా చర్చించారు. పాఠకుల సాహిత్యాభిరుచికి మూలాధారం వారి మనస్సు, దాని క్రియాశీలత.

సామాజిక దృష్టితో పాఠకుల అభిరుచి వారి సామాజిక సంస్కారాల సమష్టి రూపం. వీటి ఆధారంగానే సాహిత్యాభిముఖుడై రచనను ఆస్వాదిస్తాడు. సౌందర్యం-అసౌందర్యాల నిర్ధారణ సామాజిక సంస్కారల ప్రభావాలవల్లనే కలుగుతుంది. సామాజిక సంస్కారాల పరిధిలో వ్యక్తి తన స్వభావం, అనుభవాలను బట్టి తనదైన ఒక సౌందర్య దృష్టిని ఏర్పరుచుకుంటాడు. సమాజం సామాన్యదృష్టిని యిస్తే, వ్యక్తిదృష్టి సౌందర్యానికి విశిష్టరూపం ఇస్తుంది. ప్రతియుగంలోనూ సమాజం సౌందర్యమంటే ఏమిటో నిశ్చయిస్తుంది. దాని ప్రభావం కవిరచన మీద, పాఠకుని అనుభూతిమీద పడితీరుతుంది. ఆ ప్రభావ పరిధిలోనే ప్రతిభ-అభిరుచి వ్యక్తిపరమైన భేదాలతో వ్యక్తమవుతాయి.

సామాజికమైన సంస్కారాలు సౌందర్య, అభిరుచుల బాహ్యరూపాన్ని దిద్దితే, అంతర్ముఖమైన మానవ సంవేదన, సంస్కృతి వాటిని స్పందింప చేస్తాయి. ఆదికాలం నుండీ కళ, సౌందర్యం ఉద్భవించి వికాసం పొందటానికి ఇవే కారణాలు. వాటి ప్రభావం లేకుండా కళకు, సాహిత్యానికి జీవం లేదు. సౌందర్య, అభిరుచులను పరిష్కరించి వాటిని ఉన్నతస్థాయికి తీసుకుపోయేవి ఇవే. సామాజిక, మానవీయ, సాంస్కృతిక పరిస్థితులు అనుకూలంగా లేకుంటే సాహిత్యం, అభిరుచి రెండింటి స్థాయి దెబ్బతింటుంది. మూడు కలిసినప్పుడే మంచి సాహిత్యం, అభిరుచి, ఆస్వాదనలతో ఆ యుగం రాణిస్తుంది.

సాహిత్యాభిరుచి అందరిదీ ఒకే రకంగా వుంటుందని చెప్పలేం. వారి స్థాయిని బట్టి ప్రతిక్రియ, ఆస్వాదన జరుగుతుంది. భిన్నరుచులుగల జనులకు ఒకే సమారాధన నాటకం అన్నాడు కాళిదాసు - ''నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనం.'' ప్రేక్షకులు నాటకంలో తమ తమ స్థాయిని బట్టి వస్తువు, పాత్రపోషణ,

భావవ్యంజన మొదలైన విషయాలవైపు ఆకర్షితులవుతారని టి.యస్. యిలియట్ చెప్పాడు. శ్రేష్ఠమైన కావ్యంలో అర్థభేదాలు, వాటి స్థాయిలో భిన్నత్వం వుంటాయని చెపుతూ ఐ.ఏ. రిచర్డ్సు సాధారణ పాఠకుల సాహిత్య వివేకం, అభిరుచుల స్థాయిని బట్టి విలువ కట్టటం జరుగుతుందని అన్నాడు. సాహిత్య వివేకం, సహృదయత కలిగిన పాఠకుల పరిష్కృతమైన అభిరుచి కావ్యంలో అర్థపు లోతుపాతులు చూడగలుగుతుంది.

ఆధునికయుగంలో అన్ని జాతులవారు, అన్ని వర్గాలవారు చదువుకుంటున్నారు. వారి సామాజిక దృష్టి, సంస్కృతి, అభిరుచి ఒకే రకంగా వుండవు. రచయిత ఏ వర్గం కోసం, ఏ విధంగా వ్రాయాలన్నది ఒక సమస్యగా మారింది. రచయిత, పాఠకుల మధ్య భావయోగం, సంప్రేషణ (Communication) లేకుండా రచనను ఆస్వాదించలేం. లౌకిక సంస్కారాలు మరచి సహృదయతతో రచనను చదవాలని ఆలంకారికులు చెప్పినా అది పూర్తిగా సాధ్యపడుతుందా? ఒక నాస్తికుడు పోతన భాగవతం చదివి ఆస్తికునిలాగా భావతాదాత్మ్యం చెందగలడా? సామ్యవాదాన్ని విరోధించే పాఠకుడు శ్రీ శ్రీ మహాప్రస్థానం చదివి ఆ ఆవేశపుస్థాయి అందుకోగలడా? రచనలలో ధార్మిక, సాంస్కృతిక, సామజిక నిరూపణను మించి, అందరినీ స్పందింప చేయగల మానవ సంవేదన వ్యక్తమైనప్పుడే అది సంభవమవుతుంది. ఆ సంవేదనవల్లే ఒక యుగంలోని రచన పూర్తిగా మారిపోయిన మరొక యుగంలో కూడా పాఠకుని ఆకర్షిస్తుంది. అభిరుచి సామాజిక స్వరూపం మారినా మానవుని మనస్తత్వపు లోతులు, మానవత ఆస్వాదనకు కారణమవుతాయి. ఆధునికయుగంలో ఫిలాసఫీ, మనస్తత్వశాస్త్రం, విజ్ఞానం, సామాజికశాస్త్రం - వీటన్నిటిలో ఎన్నో కొత్త సిద్ధాంతాలు, ఆలోచనలు ప్రచారానికి వచ్చాయి. వాటివల్ల ప్రభావితమై రచయిత కొత్తదారులలో రచన చేస్తున్నాడు. ఇవన్నీ యింకా పాఠకుని అభిరుచిలో అంగాలుగా మారలేదు. వీనివల్ల ఎదురయ్యే సమస్యల మాట అటుంచి, లోకం లేక సమాజం కొన్ని భావాలను అంగీకరించటానికి తయారుగా లేదు. ఉదాహరణకు హేతువాదం వల్ల ప్రభావితులై రచయితలు రామాయణ-మహాభారతాలనూ, పురాణాలనూ విమర్శిస్తూ కావ్యాలు-నాటకాలు వ్రాస్తున్నారు. వాటిని బూతుపురాణాలుగా చిత్రించినవారు కూడా ఉన్నారు. భారతదేశంలో వారికి ఆ వాక్స్వాతంత్ర్యం వుంది. కాని తరతరాలుగా లోకం మనస్సులో ఆదర్శ పురుషులుగా, దేవుళ్ళుగా పాతుకుపోయినవారి ఆదర్శాలు, అభిరుచులు ఈ కొత్త రచనలవల్ల మారుతాయా? రావణుణ్ణీ, కీచకుణ్ణీ మరొక పాత్రనూ ట్రాజిక్ హీరోగా మార్చి కొత్త రచన చేసినా రాముణ్ణీ పాండవుల్నీ అధములుగా చిత్రించనంతకాలం

పాఠకుల అభిరుచి ఎదురు తిరిగి రచయిత అభిప్రాయాలనూ, రచననూ కొట్టి పారేయదు. గతం గురించి వ్రాసేటప్పుడు రచయిత పాఠకుల అభిరుచిని దెబ్బతీయకూడదు. ఆధునిక పరిస్థితులను గురించి వ్రాసేటప్పుడు ఈ యిబ్బంది ఉండదు. ఇలియట్''ధర్మం-సాహిత్యం'' అనే శీర్షికతో ఒక వ్యాసం వ్రాస్తూ, ఆధునిక సాహిత్యంమీద కూడా కొన్ని ఆక్షేపణలు చేశాడు. ఈనాటి రచనలు చాలవరకు అనైతికమైనవే కాకుండా సెక్సునుఉత్తేజపరుస్తున్నాయని అన్నాడు. కొన్ని నవలలు, మన తెలుగు ప్రాచీన శృంగార ప్రబంధాల, పదాలకన్నా పచ్చిగా వుంటున్నాయి.

ఇక పాఠకుల సాహిత్యాభిరుచిని గురించి కూడా కొంత చర్చ అవసరం. సంస్కృత ప్రహసనాలలో వస్తువు మాత్రమే నిమ్న వర్గాలకు సంబంధించింది కాక, వారి అభిరుచికి అనుగుణంగా వికృతమైన హాస్యం కూడా కనపడుతుంది. నిమ్నవర్గాల సాహిత్యాభిరుచిన పరిష్కరించే ప్రయత్నం కాని, కళాభిరుచిని పెంపొందించాలనే భావన కాని ఎక్కడా కనబడదు. సాహిత్యాభిరుచి ఉన్నత వర్గాల సొత్తు అయిపోయింది. ప్రాచీన గ్రీకు నాటకాలలో మధ్య మధ్య కోరస్‌ద్వారా ప్రేక్షకుల ప్రతిక్రియ ఏలా వుండాలో సూచించారు. ఎడిసన్ తన వ్యాసంలో ప్రేక్షకులలో ఒక దండధారి వుండి వారి భావప్రకటనలు కంట్రోలు చేయాలనే భావం వ్యక్తం చేశాడు. ఆధునిక కాలంలో ముద్రణయంత్రాలు వచ్చాక సాహిత్యంపేరుతో రచనలు పుంఖానుపుంఖంగా ప్రకటించబడుతున్నాయి. వీటిలో చాలాభాగం కాలక్షేపానికీ, మనోరంజన (Entertainment) కూ వ్రాసినవే. ఏవి మంచి సాహిత్య రచనలు? ఏవి చదవాలి? అని తెలుసుకోవటానికి సమీక్ష మీద ఆధారపడక తప్పదు. సమీక్ష లక్ష్యాలలో ఒకటి అభిరుచిని పరిష్కరించి రసజ్ఞతను పెంపొందించటమని కూడా చెప్పుకోవాలి. సాహిత్యశాస్త్రంలోనూ, సాహిత్య సంప్రదాయాలలోనూ ఎక్కువ పరిచయంలేని అర్ధశిక్షితులైన పాఠకులు ఎక్కువైన కొలదీ సాహిత్యాభిరుచిని సంస్కరించి పెంపొందించటం చాలా అవసరమవుతుంది. సమాజంలో మంచి అభిరుచిగల పాఠకులు ఎంత ఎక్కువగా వుంటే, మంచి రచనకు అంత ప్రోత్సాహం కలుగుతుంది. మంచి సాహిత్యాభిరుచి సంస్కృతికి గీటురాయి.

బెంగుళూరు
25-3-2001
విషు ఉగాది

– ప్రొ॥ యస్. టి. నరసింహాచారి
విశ్రాంత హిందీ ఆచార్యులు మరియు శాఖాధిపతి
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం
తిరుపతి

# ప్రగాఢ సంతాపం

ఈ క్రింది మిత్రుల రచయితల మరణానికి 'చైతన్యకవిత', 'శ్రీరస' తమ ప్రగాఢ సంతాపాన్ని తెలియజేస్తున్నాయి.

1. **శ్రీ రెడ్డి బుల్లిరాజు,** అత్తిలి, పశ్చిమ గోదావరి జిల్లా; 29-1-2001; ఇతడు గొప్ప స్నేహశీలి; మోతుబరి రైతు; పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకాలోని మా స్వగ్రామమైన 'కాకుల ఇల్లిందలపర్రు' లో ప్రాథిమిక పాఠశాలలో 1940-44 మధ్య నాకు సహాధ్యాయి.

2. **శ్రీ దండే చినరామిరెడ్డి** 'కాకరవాడ' గ్రామం, కడపజిల్లా, 15-2-2001; 1965-66 సంవత్సరాలలో రాయలసీమలో నేను చేసిన వీరగాథల పరిశోధనలో, రేనాటి సీమలో (కడప, కర్నూలు జిల్లాలలో) నాతో కూడా ఊరూరా తిరిగి నాకు మిక్కిలిగా సహకరించిన ప్రియ మిత్రులు.

3. **శ్రీమతి ఉండేల సరస్వతమ్మ,** హైదరాబాదు, 18-2-2001; ప్రముఖకవి 'కవికిరీటి' బిరుదాంకితులు డా॥ ఉండేల మాలకొండారెడ్డి గారి ధర్మపత్ని.

4. **శ్రీమతి ముక్కమళ్ళ సుబ్బమ్మ,** వెలుగోడు, కర్నూలు జిల్లా; 8-3-2001 గురువారం ఉదయం 7.30గంటలకు; ఈమె ''రేనాటి సూర్యచంద్రులు'' గ్రంథ ముద్రణలో నాకు ఎంతో సహాయం చేసిన ప్రాణమిత్రులు, కోవెలకుంట్ల నివాసి శ్రీ ముక్కమళ్ళ నారాయణరెడ్డిగారి తల్లి.

5. **శ్రీ ఆంధ్ర శేషగిరిరావు,** ముక్కామల, తణుకు తాలూకా, పశ్చిమ గోదావరి జిల్లా; 22-3-2001; ప్రముఖ పాత్రికేయులు, రచయిత, స్వాతంత్ర్య సమరయోధులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని తెలుగు ప్రొఫెసర్ ఆచార్య కోలవెన్ను మలయవాసిని వీరి పుత్రిక.

-సంపాదకుడు

# సవరణ

ప్రముఖకవి, నాటక రచయిత, నవలాకారుడు, పాత్రికేయుడు, సోషలిస్టు, సంఘసేవకుడు అయిన కీ.శే. ''వెంపో'' (పాట్నూరి వెంకటేశ్వరరావు) గారిని గురించి డా॥ మలయశ్రీగారు 'చైతన్యకవిత' 31&32 సంయుక్తసంచికలోను, దానిని అనుసరించి నేను ''రేనాటి సూర్యచంద్రులు'' రెండవ సంపుటములోను వ్రాసిన పరిచయ వాక్యాలలో కొన్ని తప్పులు దొర్లాయి. వాటిని దిగువ చూపిస్తున్నాను:

1. ''వెంపోగారు **1928లో**.......జన్మించారు''.
   (చైతన్యకవిత 31&32, పుట-72)
2. ''తెలంగాణా **తొలి కమ్యూనిస్టు మహిళ** వేములపల్లి సత్యవతి (సూర్యాపేట) గారిని 1849లో విజయవాడలో వివాహం చేసుకున్నారు. వారికి ముగ్గురు కుమారులు- షా, రాహుల్, రాజీవ్‌లు **ఉన్నతోద్యోగులు**''
   (చైతన్యకవిత 31&32, పుట-73)

పై తప్పులను ఈ క్రింది విధంగా సవరించుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను:

1. ''వెంపోగారు **1927లో**.......జన్మించారు''.
2. ''తెలంగాణా నుంచి **కమ్యూనిస్టులో చేరిన స్త్రీలలో** వేములపల్లి సత్యవతిగారు (సూర్యాపేట) **మొట్టమొదటివారు**. ఈమెను వెంపోగారు 1949లో విజయవాడలో వివాహం చేసుకున్నారు. వీరికి ముగ్గురు కుమారులు- షా, రాహుల్, రాజీవ్‌లు. **వీరిలో 'షా' ఉన్నతోద్యోగి (మిలిటరీలో లెఫ్టినెంట్ కర్నల్. ప్రస్తుతం కేరళలో ఉన్నారు). మిగిలిన ఇద్దరూ హైదరాబాదులో ప్రైవేటు కంపెనీలలో చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటున్నారు''.**

ఈ రకంగా పొరపాట్లు దొర్లినందులకు డా॥ మలయశ్రీగారితో పాటు నేను కూడా చింతిస్తున్నాను.

**-తంగిరాల**

సంపాదకుడు, చైతన్యకవిత

సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం చేసుకున్న-

# ఫిడేలురాగాల డజన్ 'పఠాభి' గారితో

## అరవయి నాలుగు వసంతాల వెనుకటి ముచ్చట్లు

## (బెంగుళూరు, 2-5-2001)

-శ్రీ కె.యస్. రామచంద్రమూర్తి
ఎఫ్.ఐ.పి. స్కాలర్, పిహెచ్.డి.,
పొ.శ్రీ. తెలుగు విశ్వవిద్యాలయం
సాహిత్య పీఠం, రాజమండ్రి

భావకవిత్వం అతివేలమైన దశలో, తన కరకు పరిహాసంతో అరికట్టబూని 'ఫిడేలు రాగాల డజన్' పలికించి, భావకవులకు చురుక్కుమనిపించిన అహంభావుక కవి 'పఠాభి'గారితో, వారు సహస్రపూర్ణ చంద్ర దర్శనం చేసిన తరువాత, వారి అరవయి నాలుగు వసంతాల వెనుకటి ముచ్చట్లు గుర్తు చేసిన సందర్భం ఇది.

'భావ కవిత్వం - విమర్శవాఙ్మయ విచారం' పరిశోధనాంశంగా ఎంచుకున్న నేను, 'భావకవిని కాను నేనహంభావ కవిని' అన్న పఠాభిగారిని తప్పక సంప్రదించవలసిన సామంజస్యాన్ని గుర్తించిన ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు గారు ఏర్పరిచిన సంయోజనమిది.

నేను : *భావ కవిత్వాన్ని ఎగతాళి చేయాలని మీకెందు కనిపించింది?*

పఠాభి : భావకవిత్వాన్ని కాదు నేనపహాస్యం చేసింది. భావకవిత్వం పేరిట చర్విత చర్వణంగా వెలువడుతున్న ప్రణయకవిత్వం అంటే వెగటు కలిగి రచించినాను. నాకు భావకవిత్వం అంటే ఇష్టమే. కాని తీపి ఎక్కువైనా వేగటే కదా!

నేను : *'కామాక్షి కోక'కీ 'వకుళ మాలిక' కీ సంబంధం ఉందా యేవిటి?*

పఠాభి : కామాక్షి కోక రాసేటప్పటికి నేను వకుళమాలిక చదవలేదు కాబట్టి అది దానికి పేరడీ కాదు. ఆ రెండింటికీ ఆధారమయిన దానిని బట్టి సమానమైన

భావాలు మా ఇద్దరికీ కలిగి ఉండవచ్చు. అలా దాని చుట్టూ తిరిగే భావకవిత్వాన్ని అందులో అపహాస్యం చేశాను.

**నేను : 'పద్యాల నడుములు విరగదంతా' న్నారు. ప్రాచీన కవిత్వమంటే...?**

**పఠాభి :** ప్రాచీన కవిత్వమంటే నాకు చాల యిష్టం. ఇప్పటికీ ప్రాచీన కావ్యాలు, భారతం, మను చరిత్ర వగైరా చదువుతూనే ఉంటాను. మా నాన్నగారు మా ఇంట్లో పండితుల చేత భారత భాగవతాలు, వసుచరిత్ర ఇత్యాదులు చదివిస్తూ ఉంటే తంగిరాల సుబ్బారావు గారి గొంతులాంటి ఆ గంభీర స్వరాల్ని విని ఆనందించేవాడిని. భావకవులు అదే పనిగా తేటగీతులు, ఆటవెలదులు, ద్విపదలలో ప్రణయ కవిత్వాన్ని పలవరించినందుకు కోపం వచ్చి అలా రాశాను.

**నేను : భావ కవిత్వమంటే మీ అభిప్రాయంలో ప్రణయ కవిత్వమేనా?**

**పఠాభి :** ఆ కాలంలో ప్రణయ కవిత్వాన్నే భావకవిత్వం అనేవాళ్ళం. కృష్ణశాస్త్రిగారూ వాళ్ళు రాసింది అదే కదా! ఆ వెనుక వాటికి అనుకరణలు బయల్దేరాయి.

**నేను : భావకవిత్వాన్ని ప్రణయం, దేశభక్తి, ప్రకృతి, సంఘసంస్కరణ, భక్తి, స్మృతి ఇత్యాది కవితాశాఖలుగా విభాగించవచ్చా?**

**పఠాభి :** భావకవిత్వం అంటే మాకాలంలో ప్రణయ కవిత్వమే. ఇలాంటి విభాగాలు చేశారన్నది తదనంతరం జరిగి ఉండవచ్చు. ఆ వివరాలివ్వండి. ఆలోచించి చెప్తాను.

**నేను : ప్రసిద్ధ భావకవులు తమని భావకవులనడాన్ని ఇష్టపడేవారు కారట?**

**పఠాభి :** వాళ్ళ గురించి వాళ్ళేమనుకున్నారో కానీ, మేమందరం కృష్ణశాస్త్రి, నాయని, వేదుల, నండూరి, దువ్వూరి, రాయప్రోలు, శ్రీశ్రీ, మల్లవరపు విశ్వేశ్వరరావు ఇత్యాదులను భావకులనే అనేవాళ్ళం. అభ్యుదయ కవిత్వం తరువాత వచ్చింది.

నేను : 'సాహితీ సమితి' లాంటి ఏదేనా సంఘంలో మీరు సభ్యులా?

పఠాభి : అబ్బే! అలాంటి సంఘాల సంగతేదీ నాకు తెలీదు. మా ప్రాంతంలో అలాంటి సంఘాలేవీ ఉండేవి కావు. మీరన్నట్టు ఉంటే అవి పత్రికలకు పరిమితం.

నేను : భావకవుల ప్రత్యేకతలని మీరేవేనా గుర్తించారా, అప్పుడు?

పఠాభి : వాళ్ళ వేషం కొంత ప్రత్యేకంగానే ఉండేది. మధ్యపాపిడితో, కండువాలతో కొంత ఆడతనం కనిపించేది. అందరూ అలా ఉండేవారు కాదు గాని, కొంతమంది పద్యాలు పాడే తీరు కూడా అలా ఉండేది. అనువాదాలు చేసి పేరు సరిగా చెప్పేవారు కాదు.

నేను : 'హైహీల్డుయాన', 'వివాహమయిన్‌ది' వంటి ప్రయోగాలు భావకవుల్ని ఉద్దేశించా?

పఠాభి : వైచిత్రి కోసం. పొల్లులు చేర్చడం ద్వారా గణాలు సరిపెట్టడం మీద కూడా ఒక విసురే ఆ ప్రయోగాలు. భావకవుల ప్రయోగాల అపహాస్యం ఉండడం యాదృచ్ఛికం కాదు.

నేను : 'నేటి కాలపు కవిత్వం' చేసిన విమర్శపై మీ అభిప్రాయం?

పఠాభి : నేను మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ఎఫ్.ఏ. (ఇంటర్‌మీడియెట్) చదువుతున్నప్పుడు అక్కిరాజు ఉమాకాన్తంగారు మాకు తెలుగు పండిట్‌గా ఉండేవారు. ఏవో పాఠాలు చెప్పేవారు. కాని ఈ సాహిత్య విమర్శ ప్రసక్తి రాలేదెపుడూ. ఫిడేలు రాగాల డజన్ రాయడానికి ముందు నేనాపుస్తకం చూడలేదు. తర్వాత కూడా సీరియస్‌గా తీసుకోలేదు.

నేను : భావకవిత్వ విమర్శ ప్రతివిమర్శలతో మీ అనుభవం ఏమిటి?

పఠాభి : భావకవిత్వం చదవడం, వినడమే తప్ప వాటిమీద వచ్చిన విమర్శలతో నాకు పరిచయం లేదు. భావకవిత్వ కాలం తర్వాత నాకు సాహిత్యవ్యాసంగం తక్కువే.

**నేను :** భావకవిత్వం వలన కలిగిన ప్రయోజనం ఏమిటంటారు?

**పఠాభి :** ప్రబంధ కవిత్వంలోలా సంకెళ్ళు లేకుండా స్వేచ్ఛగా సంక్షిప్తంగా కవిత్వం రాయగలగడం ప్రయోజనమే కదా! కాలానికి తగ్గ మార్పుగా దాన్ని గుర్తించాలి.

**నేను :** మీ ఫిడేలు రాగాల డజన్ మీద వచ్చిన విమర్శలకి జవాబు రాస్తారా?

**పఠాభి :** మొన్న మళ్ళీ ప్రచురించినపుడు నా అభిప్రాయం పీఠికగా రాశాను. విమర్శలకు జవాబు తీరిక చేసుకుని, గుర్తు చేసుకుని రాయాలంటే, చూద్దాం.

**నేను :** భావకవిత్వం నించీ తెలుగు సాహిత్యాన్ని అభ్యుదయ కవిత్వం వైపు మీరు కూడా మలుపు తిప్పారని విమర్శకులంటున్నారు. మీరేమంటారు?

**పఠాభి :** భావకవిత్వంలోని అతివేలమైన ప్రణయ కవిత్వాన్ని వెక్కిరించడమే అప్పటి ధ్యేయం. ఆనాడు శ్రీశ్రీని భావకవిగా అనుకున్నాం కాబట్టి అభ్యుదయ కవిత్వ దృష్టి లేదు. పాత ఛందస్సు లొదిలెయ్యాలని, మాత్రా ఛందస్సులు ప్రయోగించవచ్చనీ చెప్పడంలాంటి ఉద్దేశాలు మాత్రం ఉన్నాయి. వైచిత్రీప్రదర్శనే ప్రధాన ధ్యేయం. పాశ్చాత్య సాహిత్య సంపర్కమేమీ లేదు.

ఆనాటి సంగతులు గుర్తుచేసుకున్నందుకు నాకు ఆనందంగా ఉంది. మళ్ళీ మళ్ళీ గుర్తు చేసుకుంటే మీరడిగిన ఇతర వివరాలివ్వగలనేమో. మీరు అంత దూరం నుంచి నాకోసం వచ్చి పలకరించినందుకు సంతోషపడుతున్నాను.

''సాహిత్యమనే పూజావేదిక విశిష్ట సుగంధ బంధురం కావాలి''

– మహాత్మా గాంధీ

''కళయొక్క ప్రయోజనం ఏమిటి? మనిషి బుర్రలో ఉండే కుళ్ళునూ, నరాల కాలుష్యాన్నీ కడిగివెయ్యటం; బుద్ధికి అనిర్వచనీయమైన ఆనందాన్ని ఇవ్వటం. ఇంతకంటే కళకి ప్రయోజనం లేదు''

– కొడవటిగంటి కుటుంబరావు

# ''పద్మశ్రీ'' డా॥ యస్.టి. జ్ఞానానందకవి జీవితం-సాహిత్యం

-శ్రీ దార్ల వెంకటేశ్వరరావు

## 1. జననం:

భారతీయ సంస్కృతి వ్యక్తిత్వంలోను, సాహిత్యంలోను ప్రతిబింబిస్తున్న ప్రసిద్ధ తెలుగు కవులలో డా॥ సురగాలి తిమోతి జ్ఞానానందకవిగారు ఒకరు. తమ పూర్వీకుల్లో ఎటువంటి సాహితీవాసన లేకపోయినా సహజ ప్రతిభతో 'కూలీ నుండి కళాప్రపూర్ణ' వరకూ ఎదిగిన నిరంతర అధ్యయనశీలి.

జ్ఞానానందకవిగారు విజయనగరం జిల్లా బొబ్బిలి తాలూకా, పెదపెంకి గ్రామంలో 1922 జూలై 16న సురగాలి పాపమ్మ, ఎల్లయ్య దంపతులకు జన్మించారు. తల్లిదండ్రులు నిరక్షరాస్యులు, పేదవారు కావటంచేత వీరి విద్యాభ్యాసం మేనమామ దగ్గరే కొనసాగింది. ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్న మేనమామ గుంట యోహానుగారు తమ తీరిక సమయాల్లో భారత, రామాయణ, భాగవతాలలోని పద్యాలను చదివి వినిపించేవారు. జ్ఞానానందకవి గారికి ఆనాటి నుండే భారతీయ సంస్కృతి, సాహిత్యం పట్ల ఇష్టం ఏర్పడింది. తెలుగు పండితులు అప్పయ్యశాస్త్రి, ఆదినారాయణ శాస్త్రిగార్ల హితబోధవల్ల వ్యాకరణాన్నీ, తెలుగు భాషా సౌందర్యాన్నీ బాగా అవగతం చేసుకున్నారు.

## 2. సాహిత్యాభిలాష:

తరగతిలో తెలుగు ఉపాధ్యాయులు రాగయుక్తంగా పద్యాలను వివరించటం, గ్రామాల్లో భిక్షాటనకై వచ్చిన పంబలవాళ్ళు, బుడబుక్కలవాళ్ళు, జంగంవాళ్ళు మధురంగా పాటలు పాడేతీరు, తీయదనం వీరిని బాగా ఆకట్టుకున్నాయి. దీనికి తోడు తనకున్న పద్యధారణ, సహజ ప్రతిభతో పద్యకవితల్ని ఆశువుగా చెప్పడం తొమ్మిదవ ఏటనుండే అలవర్చుకున్నారు.

మిషనరీ బోర్డింగ్ పాఠశాల్లో చదువుతున్న రోజుల్లో తోటిపిల్లలతో కలిసి నీళ్ళు మోసేటప్పుడు, తోటపని చేసేటప్పుడు, హాస్టల్లో పెట్టే గంజి అన్నం

తినేటప్పుడు కలిగిన అనుభూతులను ఆవేశభరితంగా పద్యకవితల్లో చెప్పటం, దాన్ని సహవిద్యార్థులు మెచ్చుకోవటంతో కవిత్వం రాయాలనే ఆసక్తి పెరిగింది. దీనికి తోడు మేనమామగారి ప్రోత్సాహంతో రామయణ, భారత, భాగవత కావ్యాల్ని చదవటం వల్ల, దాశరథి, భాస్కర, వేమన, సుమతీ, శ్రీకాళహస్తీశ్వర మొదలైన శతకాల్లోని పద్యాలను, అమరం, శబ్దమంజరి మొదలైన గ్రంథాల్ని కంఠస్థం చేయడం వల్ల వీరిలో సాహిత్యాభిలాష మరింత ఎక్కువైంది. ఈ కవి ఛందోబద్ధ కవిత్వాన్ని పదిహేనవ యేటనుండే రాయటం ప్రారంభించారు. ఒక పాఠశాల్లో తెలుగు ఉపాధ్యాయుడిగా చేరిన తర్వాత మొదటిసారిగా సీస పద్యాలతో కూడిన 'దీనబంధు' శతకాన్ని రాశారు. ఆ రోజుల్లో ఉపాధ్యాయ వృత్తి చేసేవారికి జీతం చాలా తక్కువగా ఉండటం వల్ల చాలా కష్టాలను అనుభవించవలసి వచ్చేది. దీనివల్ల ఇంటిలోని వాళ్ళు కూడా తన కవిత్వాన్ని ప్రోత్సహించకపోయినా, నిరాశపరిచేవారని కవిగారే చెప్పుకున్నారు. ఎన్ని అడ్డంకులు ఎదురైనా కవి తన అనుభవాలను అక్షరీకరించటం మానలేదు. విజయనగరంలో మహారాజావారి కళాశాలలో సంస్కృతం నేర్చుకోవాలనుకున్నారు. కాని వర్ణ వర్గ వైషమ్యాల ధాటికి తట్టుకోలేక పోయారు. కళాశాలలోనే సంస్కృతం చదువుకోవాలనే ఆశ ఆశగానే మిగిలి పోయింది. సంస్కృత ప్రబంధాలు, కావ్యాలు మొదలైన వాటిని స్వయంగానే చదువుకొని తన ప్రతిభకు వ్యుత్పత్తిని కూడా జత చేసుకున్నారు. 1947 ఆగస్టు 15న మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన సందర్భంగా కొన్ని పద్యాలను ఒక సభలో చదివి వినిపించారు. తన కవిత్వాన్ని సభల్లో చదవటం అదే ప్రథమం. సభాధ్యక్షులుగా ఉన్న ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారు వీరిని కవిగా గుర్తించి సన్మానం కూడా చేశారు. ఆనాటి నుండీ 'జ్ఞానానందకవి' గానే ప్రసిద్ధి పొందారు.

## 3. సాహితీదృక్పథం:

ప్రతి కవీ సమాజ ప్రభావం నుంచీ తప్పించుకోలేనట్లే డా॥జ్ఞానానంద కవిగారి రచనల్లోనూ సమకాలీన సమాజం దర్శనమవుతుంది. కవే స్వయంగా ''దేశము పట్టనంత యెంతటి కవియైనను తాను నివసించు సమాజ పరిధిని యుల్లంఘింప నేరడనుట జగద్విదితము. ఆనాటి సామాజిక స్థితిగతులను వాతావరణముల నాకళించుకొని రచనలు సాగించును'' అని పేర్కొన్నారు. కనుకనే సమాజంలో కన్పించే వివిధ అంతరువులను దర్శించగలిగారు. కుల, మత, వర్గ దృక్పథాలను తమదైన కవితా దృక్పథంతో పరిశీలించి ప్రయోగించారు కవిగారు.

బంధితంబైనట్టి యంధ విశ్వాసాల
వలయాన జిక్కె నా వలపుటూహ
దిక్కుమాలిన కులద్వేష మతోన్మాద
లోకాన మ్రగ్గె నాలోని ప్రతిభ
దయసియమైన పేదరికపు బ్రతుకులో
సన్నగిల్లినది నా శౌర్య దీప్తి
కామందు ాదు భాగము భుజించుట చేత
మృగ్యమైపోయె నా భాగ్యలక్ష్మి

యుగ యుగాల నుండి ఊరికి దూరమై
బ్రతుకు గడిపినందు వలన నాదు
చరిత జన్మధరణి మరచిపోయెను కాళ
యుక్తి యేమిసేసెదో మదుక్తి - అని కుల వ్యవస్థ వల్ల ఎంతమంది ప్రతిభావంతులైన దళితులు వ్యధకు లోనవుతూ దోపిడీకి గురికాబడ్డారో ఆత్మాశ్రయ పద్ధతిలో వివరించారు కవి. అనాది కాలంనుండీ దళితులు వర్ణవ్యవస్థ వలన ఎంత నష్టపోయారో సామాజిక పరిణామ క్రమాన్ని కూడా ఆవేదనా భరితస్వరంతో వ్యక్తీకరించారు. స్వీయానుభవం కూడా వర్ణవ్యస్థను సమర్థవంతంగా వ్యక్తీకరించటానికి దోహదపడింది. కుల వ్యవస్థ వల్లనే సంస్కృతాన్ని కళాశాలలో చదువుకోలేక పోయినా దాన్ని వ్యక్తిగతంగా తీసుకోకుండా, వ్యవస్థీకృతంగానే ఆలోచించి, కులావిర్భావం, దాని మూలకారణాన్ని అన్వేషించి, భారతీయుల మధ్య చిచ్చురేపటానికి స్వార్థపరులు కుల వ్యవస్థను సృష్టించారని వ్యాఖ్యానించారు. 'వెలుగు బాట' కావ్యంలో ఈ విషయాన్నే స్పష్టీకరిస్తూ -

ఈ యస్పృశ్యత మున్ను వేదముల యందేకాని వేఱొండుగా
నీ యెందైనను లేదు మానవుఁడు దీనిన్ స్వార్థచింతాత్ముఁడై
చేయంజాలెను నేటి మానవుఁడు ఛీ ఛీ యంచు పోద్రోల నీ
హేయంబైనటు వంటి భావమును పోయెన్ ధీరమర్త్యాళికిన్ - అని తెలిపారు. వేదాలలో లేని ఈ కులవ్యవస్థ మానవుడు స్వార్థంతో సృష్టించుకొన్నాడని దానివల్ల మానవత్వం నశిస్తుందనే ఆవేదన కవిలో కన్పిస్తుంది. ఏ సామాజిక సమస్యను తీసుకున్నా సంస్కరణ దృష్టితో చూడడం వీరి కవితా దృక్పథంలోని ఒక ప్రత్యేకత. మతాన్ని, కర్మసిద్ధాంతాన్ని ఈ దృష్టితోనే చూశారు కవి. దేవుని మీద విశ్వాసం ఉండి దేవుని

పేరుతో జరిగే దోపిడీని, రాతిని పూజిస్తూ మానవుని ద్వేషించే దురాచారాన్ని ఖండించారు. 'పాంచజన్యం'లో ఈ కవితా దృక్పథాన్ని చూడవచ్చు.

కర్మము పేరు చెప్పి నరకమ్మును సృష్టి యొనర్చి వర్ణపుం
ధర్మములన్న పేరున నధర్మపు టుద్ధతికాండ బెంచి యే
మర్మములేని మానవుల మధ్యను గోడలు పెట్టి నేటికిన్
కర్మము రుద్దు మానవులు గల్గిన దేశము నీది బాలకా - కర్మ సిద్ధాంతానికి మూలం పునర్జన్మ సిద్ధాంతమే. గత జన్మలోని కర్మఫలమే ప్రస్తుత జన్మలోని మంచి చెడ్డలకు ఆధారమని ఈ సిద్ధాంతం నమ్ముతుంది. తన పూర్వజన్మ కర్మఫలాన్ని బట్టి ప్రస్తుత జన్మలోని సుఖదుఃఖాలు ఆధారపడి ఉంటాయని కర్మసిద్ధాంతం చెబుతుంది. కాని ఇటువంటి కర్మసిద్ధాంతాన్ని ఖండించారు కవి.

జ్ఞానానందకవి గారి కవిత్వంలో ప్రధానంగా కనిపించే మరో ప్రధాన లక్షణం భారతీయ సంస్కృతి పట్ల గౌరవ భావం. సంఘంలోని అధిక సంఖ్యాకుల ఆదర్శజీవన విధానమే సంస్కృతి. ఇది జాతి సర్వతోముఖ ఔన్నత్య ప్రగతులకు బంగారు బాటలు వేసిన అనేక సత్సంప్రదాయాల కూడలి. భారతీయ సంస్కృతి సాంఘికంగా, సాంస్కృతికంగా, వైజ్ఞానికంగా ఉన్నతదశలో కనిపించాలనే ధ్యేయం వీరిలో కనిపిస్తుంది. దీన్ని మిళితం చేస్తూ జాతీయతను దేశభక్తిని ప్రబోధించే కవితా దృక్పథాన్ని వీరి ప్రతి రచనలోను దర్శించవచ్చు. డా॥ ఎం. సుబ్బారెడ్డిగారు భావించినట్లు ''ప్రాచీన భారతీయులకు జన్మభూమిమీదా, నదీ నదాలమీదా, పర్వతాల మీదా, ప్రకృతి మీదా, భక్తి ఉన్నమాట కాదనలేం. కానీ అది చాలా వరకూ వైయక్తికమైంది. ఆధునిక అభివృద్ధి చెందిన జాతీయతాభావం దానికి భిన్నమైంది. దీనిలో సమిష్టి లక్షణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది''. అదే విధంగా జ్ఞానానందకవిగారి కవిత్వంలో కూడా జాతీయతాభావంతో సమిష్టి లక్షణాన్ని వ్యక్తం చేస్తూ వచ్చిన దేశభక్తిపూరితమైన కవిత్వాన్ని చూడవచ్చు. వీరు ఏ మతానికి చెందినా మానవత్వాన్ని పెంపొందించే కవితా దృక్పథాన్ని మాత్రం వీడలేదు. 'ఆహ్వానం' ఖండ కావ్యంలో -

ఇవి హిమాలయములు వివరించు నీజాతి
ప్రత్యగ్రమౌ మహౌన్నత్య చరిత
ఇవి గంగా జలములు సవరించు నీ దేశ
కల్యాణములకు బంగారు పంట

**ఇవి క్షేత్రరాజ్యాల సవనాలు పలికించు**
**విశ్వక్షమా శాంతి విమల వాణి**
**ఇవి త్యాగమూర్తుల ప్రవిమలంబయిన ర**
**క్త త్యాగ దీపాల ధర్మకాంతి**

**ఎవరి జీవితమ్ము లేరీతివైనను**
**జాతి సమత కొఱకు సాగినార**
**లేక బాట జనము లీ మహాభారత**
**చరిత గొప్పదనుచుఁ జాటవలయు** – అని చెప్పి భారతీయ సంస్కృతినీ, గొప్పతనాన్ని కీర్తించారు. వీరి మతమేదైనా క్రైస్తవ, హిందు, ముస్లిం, బౌద్ధ మతాలకు చెందిన రచనలను చేశారు. దీనివల్ల విశ్వమానవ కల్యాణభావం కలిగించటమే వీరి ధ్యేయంగా గోచరిస్తుంది. ''అన్ని మతములందునా ప్రధానమగు మానవ కల్యాణ భావముండుటచే భారత ధర్మమున విరుద్ధమూలేమియూ లేవు. భేదకమందేకత యుండుట (UNITY IN DIVERSITY) సృష్టి నియమమేగదా'' అన్ని జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు 'జాతీయత్వము- అంతర్జాతీయత్వము'' వ్యాసంలో సమైక్యతా భావాన్ని వివరించారు. అదే విధంగా జ్ఞానానందకవి గారు కూడా క్రీస్తుచరిత్ర, పాంచజన్యము, గోల్కొండ, ఆమ్రపాలి మొదలైన భిన్న మతాలకు చెందిన కావ్యాల్లో కూడా మానవులంతా ఒక్కటే అనే భావాన్ని వెల్లడించారు. 'ఆహ్వానం'లో మతం పట్ల తమ అభిప్రాయాన్ని -

**మతములన్ని, మానవతఁజాటునని తెల్పి**
**మతము పేర నొరుల ఖతము సేయు**
**దొంగ సాధులన్న కొంగ జపాలన్న**
**కిట్టరాని యేవగింపు నాకు** అని స్పష్టం చేశారు కవి.

'కళాప్రపూర్ణ'ను ప్రదానం చేసినపుడు ఆంధ్రవిశ్వవిద్యాలయం ప్రచురించిన ప్రశంసాపత్రంలో 'జాతీయతా రాష్ట్రీయతల సామరస్యమూర్తి' గా కవిని అభివర్ణించారు. ఇదే అభిప్రాయాన్ని కొంతమంది సాహితీ వేత్తలు కూడా వ్యక్తీకరించారు. భారతీయతను దానిలో అంతర్లీనంగా తెలుగు సంస్కృతిని వారి రచనల్లో కీర్తించటమే దీనికి కారణం.

జ్ఞానానందకవిగారు విశ్వనాథ, జాషువా, . దాశరథి, కాటూరి వెంకటేశ్వరరావు, దేవులపల్లి, కాళోజి మొదలైన వారితో సాహితీచర్చలు జరిపేవారు.

కవి పద్యంలోనే కవిత్వం రాయటానికి ఇటువంటి సాహితీ చర్చల ప్రభావం కూడా తోడ్పడిందని భావించవచ్చు. అంతేకాకుండా పద్యం పట్ల వీరు ప్రత్యేక అభిమానాన్ని కూడా ప్రకటించారు. 'ఆహ్వానము' ముందుమాటలో దీన్ని వివరిస్తూ ''చాలామంది సంయమన సమన్వయ స్వభావ రహితులు పద్యము చచ్చిపోయినదని యందురు. అనిన వారలటు లౌదురేమోకాని పద్యము చావదు. భాషయున్నంతవరకూ పద్యము నిలుచును. ఈ పలుకులలో వుజొక భావనకు చోటు లేదు'' అని కవిగారే ప్రకటించారు. వీరి కవిత్వంలో తెలుగు నుడికారపు సారళ్యం శబ్దసౌష్ఠవం కన్పిస్తాయి. 'పాంచజన్యం'లో ఈ విషయాన్ని

**కమ్మని తేట తెన్గు నుడికారపు సొంపు రసార్ద్ర దివ్య భా**
**వమ్ము లిఖింప నేర్పు ప్రతిభాయుతుడైన కవీంద్రు దొడ్డ గం**
**టమ్మున నుండు గాని కవనమ్ము రచింప నెరుంగ లేని ద**
**ద్దమ్మ కలానికీ విషయమందునె తన్నుక చచ్చె నేనియున్** – అని స్పష్టీకరించారు.

ఈ విధంగా వీరి కవితా దృక్పథంలో ప్రధానంగా భారతీయ సంస్కృతిపై అభిమానం, మానవతా దృష్టి, సర్వమత సమభావం, తెలుగు భాషపట్ల అభిమానం, ఏ సమస్యనైనా సంస్కరణ దృక్పథంతో పరిశీలించడం, అనర్థదాయకాలైన విదేశీ ఆచార వ్యవహారలపై విముఖత, సంప్రదాయ పద్యకవిత్వం ద్వారా అభ్యుదయ భావలు వ్యక్తం చేయటం కన్పిస్తున్నాయి.

డా॥ యస్. టి. జ్ఞానానందకవిగారిని వివిధ విశ్వవిద్యాలయాలు తగురీతిలో సత్కరించాయి. 'వంశధార' ఖండకావ్య సంపుటికి తెలుగు విశ్వవిద్యాలయం, 'ఆమ్రపాలి' కావ్యానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అవార్డుల నిచ్చాయి. ఆంధ్రవిశ్వ విద్యాలయం 'కళాప్రపూర్ణను', తెలుగు విశ్వవిద్యాలయం 'గౌరవ డాక్టరేట్'ను ప్రదానం చేశాయి. ఇవే కాకుండా మరి ఎన్నో బిరుదులు పురస్కారాలు కవిగారు పొందారు. మొదటి కావ్యం 'తరంగమాల' (1944) మొదలుకొని సుమారు 36 కావ్యాలు వరకూ రాసిన వీరు నేటికీ సాహితీ వ్యవసాయం చేస్తూనే ఉన్నారు. జ్ఞానానందకవి రచనల్లోనూ జీవితంలోనూ వారి కవితా దృక్పథం కూడా ప్రదర్శితమౌతుందనే డా. గుజ్జర్లమూడి కృపాచారిగారి వ్యాఖ్య ఎంతో పరిశీలనతో చెసిందని చెప్పవచ్చు. జీవితంలోనూ సాహిత్యంలోనూ, ప్రత్యేక వ్యక్తిత్వాలు కలవారున్నప్పటికీ, జీవించిన జీవితం తామ సాహిత్యంలోనూ, తాము సృష్టించిన సాహిత్యం తమ జీవితంలోనూ ప్రతిబింబించే కవులు మాత్రం చాలా అరుదుగా ఉంటారు. అటువంటి వారు సృష్టించిన సాహిత్యం

సమాజంలో మానవతా విలువల పునరుద్ధరణకు ఎతగానో దోహదపడగలుగుతుంది. డా॥ జ్ఞానానందకవిగారు ఒక చారిత్రక అంశాన్ని ఇతివృత్తంగా తీసుకొని రాసిన 'ఆమ్రపాలి' కావ్యంలో కూడా సమాజం పట్ల కవికున్న ఆర్తి, మానవతా విలువలకిచ్చిన ప్రాధాన్యం అడుగడుగునా కనిపిస్తూనే ఉంటుంది.

## 4. రచనలు:

తరంగమాల (1944), వసంతగానం (1947), గాంధీ (అమరగీతం, 1950), దేశబంధు (1956), పాంచజన్యం (1956), ప్రభంజనం (1959), పర్జన్యం (తొలిభాగం, 1959), గోల్కొండ (1963), క్రీస్తు శతకం (1963), క్రీస్తు చరిత్ర (వచనం, 1963), విజయాభిషేకం (1966), పర్జన్యం (మలిభాగం, 1969) అక్షరాభిషేకం (1971), ఆమ్రపాలి (1972), అక్షరాక్షతలు (1973), అక్షరగుచ్ఛము (1975), వెలుగు బాట (1976), క్రీస్తు ప్రబంధం (తొలిభాగం, 1977), నా జీవిత గాథ (తొలిభాగం, 1977), అక్షర పూజ (1979), హరిజనులు అంటరానివారా? (1980), పిల్లనగ్రోవి (1982), రాజధాని (1987), కూలీ నుండి కళాప్రపూర్ణ వరకూ (1988), వంశధార (1991), ది విజన్ ఇన్ ద వెర్సెస్ ఆఫ్ డా॥ జ్ఞానానంద కవి (1990), ఆహ్వానము (1993), షెడ్యూలు కులాలు అంటరానివా? (1997), ధర్మాగ్రహము (1998). మరికొన్ని అముద్రిత రచనలు కూడా ఉన్నాయి.

## 5. బిరుదులు:

కవితా విశారద, కవికోకిల, కవిలోక విభూషణ, విద్వత్కవి చూడామణి, సాహితీ వల్లభ, అభినవ జాషువా, సాహితీ కృషీవల, కవితా శ్రీనాథ, పద్యవిద్యా ప్రభువు మొదలైన బిరుదులు ఉన్నాయి.

ఇంకా ఆంధ్ర విశ్వవిద్యాలయం గౌరవ డ్క్టరేట్ కళాప్రపూర్ణను 1974లో ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి బహుమతిని 'ఆమ్రపాలి' కావ్యానికి 1975లో అందుకున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వీరికి ఉత్తమ పండితోపాధ్యాయ బహుమతినిచ్చి సత్కరించింది. తెలుగు విశ్వవిద్యాలయం సృజనాత్మక సాహిత్యానికిచ్చే బెజవాడ పట్టాభిరామిరెడ్డి పురస్కారం 1989లో ఇచ్చి, కవిని సన్మానించింది. తెలుగు విశ్వవిద్యాలయం గౌరవ డిలిట్‌ను 1996లో ప్రదానం చేసింది.

వీరి ఆమ్రపాలి కావ్యాన్ని ఆంధ్రవిశ్వవిద్యాలయం 1972-74 సంవత్సరాలలో బి.ఎస్సీ. వారికి పాఠ్యాంశంగా కూడా నిర్ణయించింది. ఉస్మానియా విశ్వవిద్యాలయం పి.డి.సి విద్యార్థులకు, మైసూరు విశ్వవిద్యాలయం బి.ఇడి. విద్యార్థులకు కూడా ఆమ్రపాలి కావ్యాన్ని పాఠ్యంశంగా బోధించాయి.

**ఈ వ్యాసరచనకు ఆధారగ్రంథాలు, వ్యాసాలు:**


1. శరత్ జ్యోత్స్నారాణి, ఎస్. - డా॥ ఎస్.టి. జ్ఞానానంద కవి జీవితం: వాఙ్మయ సూచి
2. జ్ఞానానంద కవి, ఎస్.టి. - కూలీ నుండి కళాప్రపూర్ణ వరకూ, 1998
3. ఆనందారామం, సి. - సమాజ సాహిత్యాలు, 1987
4. జ్ఞానానంద కవి, ఎస్.టి - ఆహ్వానం, 1996 (ద్వి.ము)
5. ________ , పర్జన్యం, 1959
6. ________ , వెలుగుబాట, 1976
7. ________ , పాంచజన్యం, 1956
8. సుబ్బారెడ్డి, యమ్. - తెలుగులో జాతీయోద్యమ కవిత్వం, 1982
9. సత్యనారాయణ మూర్తి జొన్నలగడ్డ - జాతీయత్వము-అంతర్జాతీయత్వము
10. The Vision in the Verses of Dr. Gnanananda Kavi
11. కృపాచారి, గుజ్జర్లమూడి - తెలుగు సాహిత్యానికి క్రైస్తవుల సేవ
12. రామమోహనరావు, అద్దేపల్లి - ఆంధ్రజ్యోతి, ది.ప. (వ్యా) 27-8-1988


తంగిరాల గురుడు

మనసు వెన్నపూస, మాటంత మెత్తన
చెప్పలేని ప్రేమ శిష్యులన్న
వీరగాథ రంగ వీర హంవీరుండు
నడచు కవితనౌక నా గురుండు!

– డా॥ పంపన సూర్యనారాయణ

## SAHITYA AKADEMI
## RABINDRA BHAVAN AUDITORIUM
## NEW DELHI

## *WRITERS' MEET*
## *20 FEBRUARY 2001*

# MY CREATIVE EXPERIENCE

*Speech by* ***Dr. N. Gopi***

Author of Award-Winning Book

**KALANNI NIDRA PONIVVANU (TELUGU)**

Poetry is an inevitable attribute of mine and is a must for me. It is but natural that at times, it gets snapped and interrupted involuntarily. When poetry evades me, I become perturbed.

The 'Man' I visualize is the focal point of my poetry. I quote from one of my poems:

*'When you touch a man*
*You feel his contact*
*So shall be the case with poetry.*
*The flowers of blood*
*Flowing in the veins*
*Should caress you with warmth.'*

It was a period when several movements were sweeping across the Telugu literary field. Having assimilated their essential ingredients, as a poet I grew up with a spirit of evolution, sustaining my identity. In a way, my poetry symbolizes synthesis. The man of my poetry, who emerged out of the life force of synthesis, has stood steadfast. He vehemently opposes authoritarian perceptions. His vision has growth from native local parameters to Universal dimensions. He has declared a perpetual war on inhumanity. Realising the hazards that confront the people in an ambience of commercial culture, my man has sounded a strict warning. He has

పట్టుచీర కట్టుకున్న సూర్యరశ్మిలా
తళుక్కున కనిపించి
మాయమయ్యే నీ ఆకృతి
ఒక 'తీయటి మాయ' అని -
ఎఱ్ఱ పట్టుచీరలో నీకు వీడ్కోలు పలికిన
ఈ నీ పిల్లల గుండెలకు తెలుసు -
కానీ
ఆ మాయలోనే మహదానందం ఉంది,
'మాయమైపోయే మట్టిబొమ్మ కాదు అమ్మ అంటే'
అనే సందేశమూ ఉంది!

* * *

# కోణార్క

-యస్. ఆర్. పృథ్వి

మేధ వికసించినప్పుడు
వ్రేళ్ళు సృష్టికర్త వారసులౌతాయి
మనో నేత్రకాంతి కిరాణాల్లోంచి
సృష్టి ప్రతిబింబాన్ని దిద్దుకుంటుంది
దృశ్యం దర్శకుల దృష్టి
సమ్మోహనమవుతాయి
విశ్వమొక కళల పాలపుంత
శిల్పి చేతి ఉలి - ఒక కాంతి పుంజం!

ఇక్కడ -
దశద్వాదశేతర మహాయజ్ఞంలో
ఉలుల మంత్రోచ్చారణల మధ్య
పుష్కరకాల యౌవనం
ఆజ్యంలా కరిగిపోయి,
అపర మయ సృష్టి జరిగింది.

పాదాల ప్రకంపాలకు కరిగిన శిలలు
సుందర శిల్పాలైనాయి.
ఉలి మెరుపుల్లోంచి పుట్టిన విద్యుత్తు
జీవజ్వాలై కురిసింది
కఠిన శిలల్లో దాగిన అమృతజల పొంగి,
సుందర స్వప్నాల సుమధుర ప్రవాహమై
వాస్తవ దృశ్యాలకు నేపథ్యమయింది.

ఇక్కడ పుట్టిన శిల్పసౌందర్యం
అపూర్వ హస్తకళా నైపుణీ పుష్కరిణి!
మనిషి ఎప్పుడూ అందానికి బానిసే!
అన్వేషణ అడుగులై ప్రవహించి,
మనసు, అనుభూతి సాలెగూడుకు
చిక్కుకున్న కీటకమవుతుందిక్కడ.
హృదయం లయ తప్పి,
చిత్ర విచిత్రాల అంచుల్ని స్పృశిస్తుంది.
అప్పుడు కళ్ళు -
ఆనందాన్ని త్రాగిన బృందావనమౌతాయి.
సృష్టికర్త విశ్వరూపంతో దర్శనమిస్తాడు.
పారవశ్యం పూలజల్లై కురుస్తుంది.

ఎక్కడైనా సరే
వేదమంత్రాల లాంఛనాలలో నుండి
దేవతో, దేవుడో ప్రతిమ అయినప్పుడు
అదొక చిత్రవలయం.
నమ్మకాలకు అమ్మలాంటి నిలయం.
తూర్పురాజు, రథయాత్ర ఆపి,
శిలాపీఠాన్ని అధిష్ఠించాల్సిన వేళ;
గుడిగోపురం, శిరస్సెత్తి స్వాగతించాల్సిన సమయం.
కాని,
తలెత్తిన ప్రతీసారీ కళావిహీనమై

శ్రమ చిందించే నెత్తురు విషంగా మారి
ఆందోళనకి కొత్త జీవం పోసింది.
ఊహించని పరిణామాలే
జీవిత ఖజానాలో వజ్రపుతునక లౌతాయి.
పంద్రెండేళ్ళ అభినవ అభిమన్యుడు
ఒకే ఒక్క రేయిని చీల్చి,
మయుడి సృష్టిపై అమృతం చిలకడం
ఆయనకి అంతుబట్టని ఆశ్చర్యం!
స్వార్థం లాలాజలమై ఊరేమనిషి.
మహాత్ముడైనా సరే -
ఒక్కో సారి గుటకేయక తప్పదు.
అందరికీ ఆశ్చర్యం సంబరమైతే
శ్రమాధినేత మనస్సు
పిరికితనం పిడికిట్లోకి ఒదిగిపోయిందిక్కడ.
వీడికి వాడు వారసుడని తెలియదు.
కళ్ళు క్రౌర్యాన్ని అతికించుకుని,
శరీరం ద్వేషాన్ని పులుముకుంటే -
ప్రయోజనం త్యాగాన్నే బలి కోరుతుంది.
సృష్టికది సంబరం కావచ్చు;
సంస్కృతికి మాత్రం మాయని మచ్చ.
సమస్యకి పరిష్కారమే ప్రశ్నార్థకమైనచోట
స్పందన ప్రతిస్పందనలతో పనుండదు.
గుడిగోపురం శిరమెత్తిన చోటు
తన పాలిట యమపురయ్యిందనుకుని,
ఉదయిస్తున్న భానుణ్ణి చూస్తూ,
బాలాభిమన్యుడు కడలి గర్భంలోకి జారిపోయాడు.

ఉలిలోంచి స్వార్థం ఘీంకరిస్తే
త్యాగం, కన్నీరై స్రవించిన శిల్పసౌధంలో
రేయిని చీలుస్తున్న ఖడ్గాన్ని

యజ్ఞఫలంలా బంధించడం -
అమృతాన్ని పాతాళం పాలుచేయడమనుకున్న ధర్మకర్త
ఆకాశకాంత నుదుట బొట్టులాగే వదిలేసాడు.
గుడిగోపురం మాత్రం
నిత్యం వేయికిరణాల కాంతిలో
తడుస్తూనే ఉంది!

(ప్రసిద్ధ కోణార్క సూర్యదేవాలయానికి సంబంధించిన కథ - ఈ కవితకు ప్రేరణ)

* * *

# నాడీనాళం

-డా॥ శిరీష

సందిగ్ధ మేఘాల ముసుగులోంచి
అవకాశాల ఆకాశం బయటపడి
కిటికీల్లోంచే ప్రపంచం
ప్రత్యూష కిరణమై ఉదయించడానికి
నిద్ర ఇక్కడంత తేలిక కాదు.
నీడల ముళ్ళు గుచ్చుకుని
పీడల కళ్ళు విచ్చుకుని
అట్టహాస సిద్ధాంత ఘోష వెనుక
కర్మగీతాలు మరుగున పడి
ఆనందమిచ్చే ఊహాతే రావడం లేదు.
ఆ నిద్రకోసం వెతుకుతూ ... హఠాత్తుగా
ఆస్త్మారోగి ఊపిరాగినట్లు
క్రమం తప్పిన ముఖాలు, మాటలూ
ఆక్రమించిన నీడల తెరలపై అదృశ్యమౌతాయి.
బాధల గాయాల ఎర్రని కళ్ళల్లో.
జ్ఞాపకాల చూపులు అగ్నిశిఖలౌతాయి.

ఉదయ సూర్యకాంతి ఏకోన్ముఖమై
ఒంటరి శ్రుతి చిత్రాలౌతాయి.
నాగరకత .. హార్రర్ షో ఛానెల్స్‌లోంచి
నైతిక విలువలకి ... నమ్మకాల్ని వెతుక్కుంటుంది.
మెగా సిల్వర్ స్క్రీన్ల వెలుగులు
కళ తప్పిన జీవిత కలలవుతాయి.
ఆసుపత్రిలో నిస్తేజంగా పరమపదించే
మృత్యుయోధుల అంతరాత్మ సాక్షిగా ...
పట్టించుకోని 'విధి' వీరంగానికి
పోయింది ఒక్క ప్రాణమైనా
మనసున్న మనుషులందరికీ ... అది
మరణ వాంగ్మూలమై మార్మోగుతుంది!

* * *

# పాట

– 'సుపాణి'

పాట పచ్చగా వుంటుంది
పత్ర హరితంలా ప్రతినిత్యం
పాట వెచ్చగా వుంటుంది
మిత్రుని సాన్నిహిత్యంలా ఇది సత్యం

అనాదిగా జన జీవనంలో
పెనవేసుకు పోయింది పాట
శ్రమైక జీవన సౌందర్యంలో
చైతన్య ధారగా ప్రవహిస్తుంది పాట

అలుపూ సొలుపూ ఎరుగని
ఆతిథ్యంలా పాట మెరుస్తుంది

సుఖదుఃఖాల సంవేదనలో
సోయగమ్మై పాట మురుస్తుంది

కళ్ళల్లో కారుణ్యపు కాంతిరేఖలా
పాట నడుస్తుంది
ప్రవహించే నదులపైన
పేరోలగమ్మై హసిస్తుంది పాట

పిండారబోసినట్లు
వెన్నెల జలతారు గట్టినట్లు
చీకట్లో దివ్వెలు వెలిగినట్లు
ప్రకాశవంతమై భాసిస్తుంది పాట

కోయిల నాదం పాట
ఆకుల గలగల పాట
నదీనదాల సయ్యాట పాట
హిమగిరిపై మృదంగం పాట

పాటే లేకుంటే
ఆక్రందనే ప్రతినోట
పాటే పైకి రాకుంటే
గుండె లోతుల్లో బీట

చదువున్నా - లేకున్నా
పెదాలపై కదిలేది పాట
తోడబుట్టక పోయినా
తోడు నీడగా నిలిచేది పాట

అమ్మ నోటిలో పుట్టి
అడ్డదారుల్లో మెట్టి
అడుగడుగునా జగాన
అఖిలమై సాగేది పాట

సరిగమపదనిసల
సంగీతం పాట
సరిగా పదమని ఆదేశించే
సంకేతం పాట!

* * *

# సీతాసుధాకర్ కవితలు

## 1. యథార్థం

ప్రకృతి అందానికి పరవశిస్తూనే ...
ముక్కుతూ, మూల్గుతూ ఊతంతో నడిచే నేను,
అదిరిపోయాను ఆ వృద్ధురాలి దారుఢ్యానికి, ఆత్మస్థైర్యానికి,
ఆగిపోయాను, నా ఆరోహణా ప్రయాణపు తొలిమలుపులోనే.

మెరిసే కళ్ళతోనే చూస్తుండగానే నడిచి,
ఉరమని మెరుపులా మాయమయిందా ముడుతల వయ్యారి
జీవన చైతన్యాన్ని వెదచల్లుతూ ... విరజిమ్ముతూ ...

నా అందం, ఆరోగ్యంపై ఉన్న నమ్మకపు పూతకు
ఆకర్షణ పోయి పొడిపొడిగా రాలుతుండగా
పాకుతున్నాను నేనింక నడవనే నడవలేక.

## 2. సందేహం

నువ్వు, నేను మనిద్దరమేనా ఈ ప్రపంచం?
ఏం ఎందుక్కాదు?
మన ప్రపంచంలో మనమే ఆడం, ఈవ్.
మనిద్దరిదే ఈ మహత్తర సృష్టి.

మనలో ఆడమ్ ఎవరు? ఈవ్ ఎవరు?
- అన్న ధర్మ సందేహం రానంతవరకు,
యిక్కడ సైతాన్ లేదు, దయ్యం లేదు,
అంతా మన్మోహన సుందర వనమే!

## 3. ఇదేనా న్యాయం?

ఎగురుతున్న నా రెక్కలు వంచి
గగనంలోంచి పట్టి దించి
ఆలుబిడ్డల నుండి విడదీసి
పెట్టారో యిరుకు పంజరాన.

విరిగిన నా రెక్కలు
పగిలిన నా గుండెలు
కారే నా కన్నీళ్ళు
కదిలించలే దెవ్వరి మనస్సులు.

మహానాయకు లిచ్చారు భాషణం
స్వాతంత్ర్య ప్రతీకగా వొదిలారు శాంతికపోతం.
ఎగిరెగిరి వెళ్ళాల్సిన నేను తిరిగొచ్చి ప్రశ్నిస్తున్నాను
మానవత్వం మరచిన మీ మనుషులను.

ఇదేనా మీకొచ్చిన స్వాతంత్ర్యం?
ఓ క్షణపు మీ శాంతి సంకేతం కోసం
నా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హరించటం
రోజుల తరబడి నన్ను బంధించటం
ఏం న్యాయం? యిదెక్కడి న్యాయం?

* * *

# వి. నాగలక్ష్మి కవితలు

## 1. ఈ తరం బాల్యం

అమ్మ అనటం రాని ప్రాయంలోనే
    అక్షరాభ్యాసం।
పాలసీసా పట్టుకోవడం రాని చేతికి
    పెన్సిల్, నోట్‌బుక్।
మాతృభాష రాలేదు ఇంకా,
    ఇంగ్లీషు భాష మొదలు।
మమ్మీ, డాడీ, మిల్క్, వాటర్
    లాంటి ఇంగ్లీషు మాటల గారడి।
వేలకి వేలు డొనేషన్లు ఎ.బి.సి.డి.లకి!!

అమ్మ ఒడిలో చేరాలని
    ఇంటికి వస్తే, డోర్‌లాక్.
అమ్మకోసం ఎదురుచూపు,
    ఆఫీసులో అలసిన అమ్మకి
లాలించే ఓపిక, తీరిక ఏది?
    హాయిగా ఆడుకునే టైమ్
హోంవర్క్‌కి సరిపోతుంది
    లేరులే ఆటల్లో నేస్తాలు
ఉన్నాయి టి.వి. ఛానల్స్ కావాల్సినన్ని!

ఇరవయ్యొకటో శతాబ్దం
    ప్రగతిశీలురూ -
పిల్లల బంగారు బాల్యం
    నిర్దయగా, కర్కశంగా కరిగిపోతోంది.
ఇలాగే సాగితే?
    ''బంగారు బాల్యం'' పేరుతో
మరొక పాఠ్య పుస్తకం చదవాలేమో?
    శోధించండి??

బాల్యం గతి తప్పితే జీవితమే
గతి తప్పుతుంది సుమా!!

## 2. గడ్డి పోచలు నీళ్ళోసుకున్నాయి

మేఘ మాలికలు
వయ్యారాలు పోతూ
వరుణుడిపై విసిరాయి
ప్రేమపాశాల్ని!

ప్రేమ మోహితుడైన
వరుణుడు మోహాన్ని
భరించలేక
తన తాపాన్ని వర్షించాడు!

పుడమి పులకించింది
అమాయకంగా!
చెట్లు, పుట్ట, పచ్చని గరికలు
పిచ్చి మొక్కలు
నీళ్ళోసుకున్నాయి!

* * *

## ఆమె

-పాతమత్తిగిరి సుబ్రహ్మణ్యం

పాదాల పసరు కరిగిపోయిన ప్రవరాఖ్యుడిలా
నేను దిక్కులు చూస్తూ నిలబడ్డప్పుడు
ఆమె ఆ కర్ణ దీర్ఘ నేత్రాంభోరుహంలో
నిర్లజ్జ, నిర్భీశంఖత
ఆమె దరహసిత చంద్రికా లోకంలో

ఆమె లోచన ప్రాంగణంలో
దిగంబరీకృతమైన ఊహ్పితాలు
ఎంతకూ అర్థంకాని సింబాలిక్, మిస్టిక్ పొయట్రీల్లా
ఆమె మాటలు, ఆమె చేతలు
నేను జిడ్డు కృష్ణమూర్తి, పి.టి. రాజు
సచ్చిదానందమూర్తి, శారదాదేవి గార్ల గురించి
గంటల తరబడి మాట్లాడితే
ఆమె సోక్రటీస్, ప్లేటో, రసెల్,
అరవింద ఘోష్‌ల గురించి
రోజుల తరబడీ మాట్లాడేది.
నేను త్యాగరాజ కృతుల్నీ, అన్నమయ్య కీర్తనల్నీ
భక్తిపరవశంతో పాడితే
ఆమె ఎంకి పాటల్నీ, కిన్నెరసాని పాటల్నీ
గాలిబ్ గీతాల్నీ, ఉమార్‌ఖయామ్ రుబాయీల్నీ
గద్గదిక మధుర సూక్ష్మస్వరంతో పాడుతుండేది
నేను ఆగమ నిగమాల గురించీ పాతివ్రత్యం గురించీ
చెబితే
ఆమె రాధికా సాంత్వనం గురించీ
తారాశశాంకం గురించీ, చలం గురించీ
చర్చలు ప్రారంభించేది.
నేను ఈ భవసాగరం దాటేందుకు
తారకయోగం గురించి వివరిస్తే
ఆమె మన్మథ, వాత్స్యాయన, కూచిమార
కొక్కోక శాస్త్రాల గురించి అనర్గళంగా మాట్లాడుతూ
దశ కామ దశల్నీ ప్రదర్శించేది
మాటల్లో పదచిత్రాల్నీ, భావచిత్రాల్నీ
గుమ్మరించే ఆమె పాండిత్య ప్రకర్ష
ఆమె అలతి నవ్వులు, ఆమె లావణ్య విభ్రమం
ఆమె మందాక్షం, ఆమె కృపావిలసనం
బిందుచ్యుతి కైతవంతో

సారె సారెకూ మన్నించమని మ్రొక్కుతూ
అతీవ దుఃఖంతో, ఆవేదనతో
అత్యంత వ్యాలోలంతో, ఊపిరి సలపనివ్వకుండా
నన్నల్లుకోవాలనీ, హత్తుకోవాలనీ
ఆమెలో ఆ మహదాకాంక్షను
ఆ రసోద్ధతినీ, ఆ యోగభరాన్నీ
కేవలం విషమ లంపటత్వం అని నేనెలా అనను?
ఆమె ఆ తెంపరితనం వెనుక
ఆమె ఆ తిరుగుబాటు తత్వం వెనుక
క్షణిక సుఖాలపై ఆమెకున్న ఆ కక్కుర్తి వెనుక
ఆమె మనస్సుపై ఈ సమాజం చేసిన
యుగ యుగాల ఆరని గాయం వుంది.
ఆమెకు దాపురించిన దుర్భర వైధవ్య జీవితంలో
ఆమె నుదుటి కుంకుమను చెరిపేసి
నవ్వుల్నీ పువ్వుల్నీ నిషేధించిన
ఈ సమాజంపై కసి ఉంది.
ఆమె హఠాత్తుగా ఓ రోజు చెప్పా పెట్టకుండా
అదృశ్యమై పోయింది.
భక్తికీ, రక్తికీ నాకు నిర్వచనం చెప్పి
పరతత్వగవేషణకు నన్ను సంసిద్ధుణ్ణి చేసి
ఆమె శాశ్వతంగా నా నుండి దూరమైపోయింది
ఆమె జ్ఞాపకాల పరిమళం మిగిల్చి పోయింది.

''ఆధునిక కవిత్వం నేడు సర్వసాహిత్య ప్రక్రియలకూ అగ్రేసరంగా సాగుతోంది. జాతి జీవనాడిని సంరక్షిస్తోంది. జీవితంలో సంభవించే సుఖదుఃఖాలనూ, క్లేశాక్రోశాలను ఆధునిక కవిత్వం ప్రతిఫలిస్తోంది. బ్రతుకులో సంభవించే సుతారమైన శ్రుతులను సైతం కవితాతంత్రి వెనువెంటనే పలక గలుగుతోంది. అందరికీ వినిపించేలా శ్రావ్యంగా పలకగలుగుతోంది''

-డా॥ ఆవంత్స సోమసుందర్

# కొబ్బరి చెట్టు

-బులుసు వేంకటేశ్వర్లు

కోనసీమలో కొబ్బరి చెట్టు
రెక్కలు తెగిన జటాయువులా ఉంది!
మృత పిండాన్ని ప్రసవిస్తున్న
గోమాతలా ఉంది -
జారి - క్రిందపడిన పగిలిన గ్రుడ్లలో
వికృతాకారంతో కొట్టుకొంటున్న
సంతానాన్ని చూస్తూ
నిలబడ్డ తల్లి పక్షిలా ఉంది!

అచ్చం -
పదేళ్ళక్రితం
ఈ గోదారి గట్టు ప్రక్కనే
చితిమంటల్లో కాలిపోతున్న
నాన్నలా ఉంది!!

*(1997లో గోదావరి జిల్లాలలో సంభవించిన భయంకర తుఫానును చూచి)*

* * *

# నీది శుభదృష్టి ప్రియురాలా!

-కె. కిశోరు బాబు
-కె. అశోకు బాబు

ముడి సరుకులాంటి వాడిని
ఒక కంట నిప్పుల్ని చిమ్ముతూ
నాలోని చిలుమును కరిగి నన్ను నిర్మలంగా
ఒరిపిడి పట్టిన బంగారంలాగా
తళతళలాడింప జేస్తున్నావు!

మరొక కంట ప్రేమను చల్లుతూ
నాలోని కామాన్ని కడిగి
నన్ను పవిత్రంగా
పరిశుద్ధపరచిన వెండిలాగా
మిలమిలలాడింప జేస్తున్నావు!

నువ్వు నిప్పుల్ని చిమ్మినా
ప్రేమను చల్లినా
నీది ''శుభదృష్టి'' ప్రియురాలా!

* * *

## 'నిత్య బాల్యమై'

– యశశ్రీ రంగనాయకి

నిద్రలోంచి –
బద్ధకంగా కళ్ళు విప్పిన క్షణం...
మత్తులో జోగే జాబిళ్ళను ...
వాన చినుకుల్లా చేస్తాను.
ఉదయాన్నే –
రెండు జాబిళ్ళు
రోడ్లపై బంతులై కదులుతూ ...
రిక్షాలో సువాసనై ఒదుగుతూ ...
టాటాల్తో మాయమౌతూ!
సాయంత్రం ప్రేమచూపు సూర్యునివైపు
చదువు, రాయి, చెప్పు –
అనే ...
కటకటాల కిటకిటల్లోంచి ...
కాన్వెంట్ బూట్లు –
ఊరేగింపు ఉరుకులై ఇంటికేసి!

స్కూలు కబుర్లు -
అమ్మ సింహాసనంపై
అలలై కదులుతాయి.
హోంవర్క్ డైరీలోంచి
కంప్లైంట్ల కాయల్ని కోసేసే పిల్లల చేతులు
అక్షరాల పూలు దిద్దుతాయి.
లేత బుగ్గలు -
పాల బువ్వ తింటూ ...
నిద్ర చుట్టాన్ని చూసి, మాటలాపి భుజంపై మొగలి రేకులౌతాయి.
ఇల్లంతా - మౌన శబ్దం
బాల్యమెంత అమృతం!
అమ్మైనప్పుడే అనుభవించగలిగేది
అల్లరి బొమ్మల్ని ఆడించేటప్పుడు నాలో పరిమళించేది.

* * *

## సంద్రం

–'జాహ్నవి'

అన్నీ అయిన వాస్తవం
మొత్తానికి మొత్తంగా కాక మిగిలివున్న
నేతిబీర నిజం
తన్నుకు వస్తున్న కడలిని
పరిస్థితుల చెలియలి కట్టతో కంటి రెప్పలో
నిలువరించడం
సాగరం కోతను అడ్డుకుందుకు
ఏ వృక్షరాజాలో హరితాన్ని హారతిచ్చి
అక్కున చేర్చుకుంటాయి.

మెదడు నిర్వీర్యాన్ని
గుండె కోతను

ఊరడించే మనిషితనం లేక
మలేపడుతున్న సంబంధాల మధ్య
అనుమానాల అపనిందల
చవితినాటి చంద్రుణ్ణి చూసిన దోషం
అమృత తుల్యమైన సున్నితత్వం బందీయై
శిలువెయ్యబడుతుంది.

అయినా
విడువక మరవక
అలకు మల్లె పరుగెత్తుకొస్తాను అన్నీ మరచి
మహాబలేశ్వరుని పాదాలను ముద్దిడుతున్న గంగకు మల్లె.

అడుగుల సడి
గుండెకు తడి నిస్తుందన్న మిణుగురు 'ఆశ' రెపరెపలో
విన్నపాలో సగపాలో
మనస్సు కాళ్ళకు రెక్కలొచ్చిన విహంగాన్నై
రెక్కలల్లారుస్తూ
అల్లుకు పోతాను ఆవరిస్తాను
ఒదిగి పొదుపుకొని ఎదగాలని
అంతశ్చేతనలో ఇంకి పోతాను
శుభ్రజ్యోత్స్న మనస్సుతో ...
వేకువ చేయిపట్టుకు నమస్సుతో ...

## 'చైతన్య కవిత' ప్రత్యేక సభ్యులకు మనవి

పూర్వం చైతన్య కవితకు **200**రూ. లు కట్టిన చందాదారులందరూ మరో **300**రూ. లు కట్టి జీవితసభ్యులుగా మారవలసిందిగా ప్రార్థన. పత్రిక ముద్రణవ్యయం నాలుగు రెట్లుగా పెరిగిపోవడం వలన ఈ మనవి చేసుకుంటున్నాం.

-సంపాదకుడు

# భూకంపం

– అల్లంరాజు కామేశ్వరశర్మ

చేలు రైతుల కలలకి పాలుపోసి పంట ముఖానికి తెస్తూనే ఉన్నాయి
పసిపిల్లలు తల్లి అప్యాయతని పాలచుక్కలు చుక్కలుగా పితుక్కుంటూనే ఉన్నారు.
అవ్వ – చలికి ఒంటి మీది ముడతల్ని దుప్పటిగా కప్పుకుంటోంది
తాడు తెంచుకున్న లేగదూడ మందలో తల్లికోసం వెతుక్కుంటూనే ఉంది!
హాస్పిటల్లో బెడ్‌మీద కడుపులో బిడ్డ అడ్డం తిరిగిన
మాతృమూర్తి ఆర్తనాదం పెదవుల గడప దాటేలోగానే –
ఒక్కసారిగా ఒళ్ళు విరుచుకున్న భూకంపం
రాక్షస పాదాలతో అందరి ప్రాణాల పీక నొక్కేసింది!
నీడనిచ్చిన ఇంటి దూలాలే బాణాలై గుండెల్ని చీల్చాయి
ఇంటి ఇటుకలే ట్రాన్సిస్టరు బాంబులై బ్రతుకుల్ని బ్రద్దలు చేసాయి!
కాలం నూరిన కత్తి అంచున బాల్కనీలే శతఘ్నులై పేలాయి.
మృత్యులోయలో ''కచ్'' కూరుకుపోయింది.
ఎటు చూసినా, ఎక్కడ చూసినా మృత్యు రాక్షసి
వికటాట్టహాస ప్రకటనలే!
వయోభేదం లేదు – చిన్నా, పెద్దా తేడా లేదు.
చావు తొంగి చూడని గుమ్మం లేదు!
ఎంత క్రూరమైందీ భూకంపం!
ఆజిల్లా ప్రాణాల్ని రెక్టార్ స్కేలుపై శిలువ వేసిం దీ భూకంపం!
సర్వత్ర శ్మశాన ప్రశాంతత రాజ్యమేలుతున్న దృశ్యం
శవాల వంతెన క్రింద రక్తం ఏరులై పారుతోంది!
ఒకే ఒక్క క్షణంలో ఎందరి ఊపిరి ఆవిరైపోయిందో!
కన్నీ[illegible] [illegible]వైన చావు ఎడారి అయిపోయింది ''కచ్''!!
అలవాటైన హెలీకాప్టర్లు ఓదార్పుల పొట్లాలు జారవిడిచాయి
గ్రద్దలు వచ్చి కారణాలు వెదుకుతున్నాయి!
రాబందులు తమ ప్రగాఢ సానుభూతి ప్రకటించాయి!
దుఃఖం – ఇంక అక్కడ ఉండలేక – మన మనో నేత్రాల మీదుగా

అనంతవిశ్వంలోకి వలసపోయింది.

నా గుండె పట్టు తప్పి ఎక్కడో జారిపోయింది!

(భూకంపంలో మరణించిన వారికి -
ప్రాణం మాత్రమే మిగిలిన బాధితులకు ఈ నా కవిత అంకితం)

* * *

# రెండు కవితలు

-మేడిచర్ల సూర్యప్రకాశరావు

## 1. వెలుతురు పిట్టలై

తేనె చినుకులై
నీ నవ్వులు ....
వజ్రపు తునకలై
నీ మాటలు ....
ప్రశంసల పారిజాతాలై
నీ పాటలు ....
పనస తొనలై
నీ ఊహలు ....
సంద్రపు అలలై
నీ ఆలోచనలు ....
ఉషాకిరణాలై
నీ చూపులు ....
వెలుతురు పిట్టలై
నీ జ్ఞాపకాలు ...!

## 2. ఇసుక రేణువై

నీ తొలిచూపు తొలకరి చినుకై
నా హృదయ క్షేత్రాన్ని తడిపితే

నా మనో ఆకాశంలో
నీ జ్ఞాపకాల హరివిల్లులు విరిసాయి ....
నీ వో పుష్పమై పరిమళాలు వెదచల్లితే
నే నో మధుపమై స్వేచ్ఛగా విహరించాను ....
నీవు ఆణి ముత్యమై తళుకులీనితే
నేను స్వాతిచినుకునై స్పర్శించాను ....
నీవు కెరటమై ధరణి తీరాన్ని ముద్దిడితే
నేను ఇసుక రేణువై నీ ఒడిలో కరిగిపోయాను ...!

* * *

# విహగ రాణి

–ఆచంట హైమవతి

విహాయసంలో ఎగిరి –
ఇలపై దిగిన
యంత్ర పక్షి కుక్షి –
ప్రసవిస్తుంది పయనికులను.

మళ్ళీ మళ్ళీ చూలింతయై
మరల, మరల బాలింతౌతుంది.

నింగికి ఆరోహిస్తూ
నేలకు అవరోహిస్తూ
నిత్య కర్తవ్య పారీణ
ఈ విహంగ రాణి.

సుప్రసన్నయై దూరన నుండగా
ఆలపిస్తుంది మృదు ప్రణవనాదాన్ని.

వ్యత్యాసమైతే పతనమౌతుంది
దహిస్తుంది ప్రళయమై

దారుణ - దావాగ్ని కీలలై
ప్రజ్వలిస్తుంది మారణహోమమై.

అనుకూల కాల పరిధిలో -
అతివేగ గమన సాధిని.
దాటు నదీ, శృంగ, శరధి
వివిధ సంస్కృతుల వారధి.

* * *

## సానుభూతితో పరాభవించక ...

-చిటిప్రోలు వేంకటరత్నం

మిత్రమా!
ఎంత వెఱ్ఱివాడివి నువ్వు!
కళ్ళల్లో ఆ జాలేమిటి?
పెదవులపై 'అయ్యో' అక్షరాలేమిటి?
సానుభూతి ఒలికించడమా ఇది?
నీ అవివేకానికి అవసరం సానుభూతి
నీ అహంభావం ఒక తుచ్ఛజాతి
పురివిప్పి ఆడబోయే వాళ్ళ ప్రజ్ఞామయూరిని
కుంటిగా చెయ్యకు నీ జాలిచూపులతో
వాళ్ళ ఆత్మగౌరవాన్ని, వాళ్ళ ఆత్మవిశ్వాసాన్ని
ఆత్మదూషణగా మార్చివెయ్యకు
నీ బేలమాటలతో
సామర్థ్యాన్ని చంపి, జీవన రాగలతను తెంపి
వాళ్ళను తాత్త్వికంగా ఖూనీ చేసిన
పాపం మూటగట్టుకోకు

వాళ్ళు దీనమానవులనుకుంటున్నావు కదూ!
కారు.

మనిషిలోని ప్రేమ స్వర్ణం ఎంత స్వచ్ఛంగా ఉందో తెలుసుకోవడానికి
పరమాత్ముడు ఉపయోగించే గీటురాళ్ళు
మనిషిలోని విజ్ఞానశక్తిని సవాలు చేయడానికి
పరమాత్ముడు విసిరిన సమస్యలు
వాళ్ళు లేకపోతే థెరిస్సాలూ బ్రెయిలీలూ మానవ కోటికి
ఎలా దక్కి ఉండే వాళ్ళనుకున్నావు?

జగతికి చైతన్యాన్ని పంచి ఇచ్చే
సహస్రకిరణుడి రథం తోలేది
తొడలు లేని అసూరుడే అన్న సంగతి తెలిసి కూడా నువ్వు
వాళ్ళను అశక్తులుగా అనుకుంటుంటే
వెఱ్ఱివాడివి కాక ఏమౌతావు?
ఒక అంగమో అందులోని అంశమో కొదవైందని వాళ్ళలోని
మానవాంశ పూర్ణతనే శంకిస్తావా?
మన శక్తియుక్తులు మన అవయవాలలో ఉంటే
వాళ్ళ శక్తియుక్తులు
వాళ్ళ తీక్షణ సంకల్పాలలో ఉన్నాయి.
సహజ శరీర యాంత్రిక సూత్రాలనే ఛేదించిన మహాయోధులు వాళ్ళు
ఒక అవయవపు అల్పశక్తిని మరొక అవయవపు అధికశక్తిగా మార్చుకునే
లీలావినోదులు వాళ్ళు ....

నువ్వు గమనించ గలిగావో లేదో కాని
కళ్ళు లేని కబోదికి ఒళ్ళంతా కళ్ళే
అతనికి తన పరిసరాల 'జాగ్రఫీ' కొట్టిన పిండి
ఆ పరిజ్ఞానంతో అతను స్వైరవిహారం చెయ్యగలడు
ఆ భగవంతుడు తనకు లేకుండా చేసిన దృశ్య ప్రపంచాన్ని
అంతకన్నా ప్రశస్తంగా ... తన ఇష్టాల కనుగుణంగా
తనలోనే సృజించుకొనగలడు.
మాటలు రాకపోవడం లోటని నీ ఉద్దేశమా?
అభినయ దర్పణమై అణువణువూ .... తనువంతా
మనసులోని సంగతులను మనకు తెలుపుతూంటే

మళ్ళీ మాటలతో పనేమిటి?
చూడు మరి ... వీళ్ళంతా ఇంతే ... ఊహ కందని వింతే!

తెలివి మనకేసి తెలుసుకోవడం లేదుగాని మనం
ఈ అంగ వికలత
ఏ అసామాన్యుడి విజృంభణను ఆపగలిగింది?
ఏ తీవ్ర దీక్షితుడి వికాసాన్ని మాపగలిగింది?
హెలెన్ కెల్లర్ లోకానికి బోధించిన పాఠం
నీ మేధలో పాదం పెట్టలేదా?
కృష్ణశాస్త్రి, గిడుగు పిడుగు, సుధాచంద్రన్, సంజీవరాయడు
వీళ్ళంతా ..
వాళ్ళ వాళ్ళ క్షేత్రాలకే కాదు అవిటి వాళ్ళ గోత్రాలకూ స్ఫూర్తి ప్రదాతలే!

ఇక ఇప్పుడు నువ్వు ఇంకొక విషయం కూడా ఆలోచించాలి
ఏవేవో లోపించిన ఇంతమంది ఎన్నో ఎన్నో సాధిస్తుంటే
ఏదీ లోపించని మనం ఏమి సాధిస్తున్నాం?
అందుకేనయ్యా ... అసలైన వైకల్యం ఆంగికమైంది కాదు

సోమరితనం వైకల్యం
కపటత్వం వైకల్యం
సంకుచితత్వం వైకల్యం
దౌర్జన్యం వైకల్యం
నైతికపతనం వైకల్యం
లక్షా తొంభై అవలక్షణాలు వైకల్యం
ప్రాణమైన ధర్మం హీనమై పోగా
వ్యవస్థ శవం కావడం అన్నిటికన్నా వైకల్యం

అందుకని ....
ఈ ప్రపంచానికి వాళ్ళూ కావలసిన వాళ్ళే అని గ్రహించి
సానుభూతితో పరాభవించక
సహకారంతో సంభావించు
అప్పుడు వాళ్ళూ కలిగించగలరు

జన్మభూమికి
తన్మయత్వం!

* * *

# సిస్టరమ్మ

-ఎన్. ఈశ్వరరెడ్డి

మానవత్వాన్ని మూర్తీభవించుకున్న
సేవాదేవత నీడసోకగానే
నెత్తురు కారుస్తూ ఏడ్చేగాయాలు
అమ్మ రొమ్మునందుకున్న పసిపాపలౌతాయి

ఆమె స్పర్శ తగలగానే
గిలగిలా తన్నుకుంటున్న ప్రాణం పిట్ట
తల్లి రెక్కకింద తలదాచుకున్నంత
బ్రతుకు నమ్మకాన్ని పొదుక్కుంటుంది

ఆమె చేతి గడియారంలో
గంటల అంకెలకు బదులు
రోగి మందుల మైలురాళ్ళు నాటబడి ఉంటాయి
లింగభేదాల అగాధాలను దాటి ఆమె
రోగి బాధల్ని బయటికి పిండేస్తుంటే
నిష్కామకర్మను జీర్ణించుకున్న యోగినిలా కనిపిస్తుంది

ఆమె కళ్ళనిండా పొంగుతున్న అంకితభావం
ఆసుపత్రిని పునీతం చేస్తూ ఉంటుంది

అత్తరు కంపుకు అలవాటుపడ్డ వెర్రిజనం
క్షతగాత్రుడి యాతనను చీదరించుకుంటూ వెళ్ళిపోతారు
ఆమె తన ఆప్త హృదయంతో ఎదురొచ్చి
మరో థెరిస్సా అవుతుంది

జ్వర పీడితులు వాంతి చేసుకున్నా
టి.బి. రోగి నెత్తురు కక్కినా
తన గుండెను దోసిలిగా పడుతుంది

జులాయిగాళ్ళు ద్వంద్వార్థాల వలలు విసిరినప్పుడు
తనకు వాళ్ళ భాషే రానట్లు
శీలాన్ని చిక్కబట్టుకుని పాదరసమవుతుంది

మెలిపెడుతున్న జీవితబాధల్ని
తెల్లగౌనుకింద కట్టిపడేసి
చిరునవ్వును ఫలహారం చేస్తుంది
సిస్టరమ్మ ఔన్నత్యం ముందు
అమ్మ ప్రేమ చిన్నబుచ్చుకుంటుంది!

* * *

## గాయం చేసిన గానం!

– అనంత వెంకటేశన్

గాయం చాలా కష్టంగా ఉంటుంది ఎవరికైనా
అయినా నాకు చాలా ఇష్టం!
పుట్టినప్పటినుండి ఎన్ని గాయాల్ని
గానం చేసిందో ఈ హృదయం!
ప్రతి గాయానికీ ఒకో విశిష్టత
దేనికదే ఒ బృహద్గ్రంథం
వెన్నెల చేసే తీపిగాయం ఆహ్లాద పరిస్తే ...
చీకటి చేసే చేదు గాయం ... ఛెళ్ళున చరుస్తుంది
మంచుముద్దలో శరీరాన్ని కూరినట్టు కాలుస్తుంది.
అది కరిగి, తిరిగి నెత్తురు నిప్పై
చైతన్యంతో రగిలినపుడు
ప్రతీకారానికై పరుగిడితే పశువవుతావు.

నిగ్రహంతో నీలోకి నిన్ను చూసుకుంటే
నిజమైన మనిషవుతావు
స్వాతిశయాన్ని చొరబడకుండా చూసుకోగలిగితే
అలలు అలలుగా ఎన్నో అనుభవాలు
ఎప్పుడూ ఏదో ఒక పాఠాన్ని నేర్పుతూనే ఉంటాయి.
బంగారపు సుద్దలాంటి నిన్ను
బంగారు ఆభరణంగా తయారు చేస్తాయి.
అందుకే ... గాయాలంటే నాకెంతో మమకారం
వాటిని అపురూపంగా తడుముకుంటూనే ఉంటాను
ప్రతి గాయం - తనే జీవితానికి సర్వోత్కృష్టమైన దంటుంది.
ఇంతలోనే నేనున్నానంటూ
మరొకటి దూసుకొస్తుంది.
మనిషి మనసు గాయాల గుట్ట
స్పృశించగలిగే ఎదుటి మనసుకి
స్వంత అనుభవాలంత చీమల పుట్ట!

* * *

## మందారమాల

– ఆచార్య శలాక రఘునాథశర్మ

గోదారి పడమటి గాలుల పవిత్రతతో
మాధుర్య పరీమళాలతో పరవశించిపోయే
తణుకు ప్రాంతాల తళుకు ఒకటి
ఎక్కడెక్కడో విహార విన్యాసాలు నిర్వహించి
బెంగుళూరు బెళుకుగా ఇప్పుడు తళతళలాడుతున్నది.
కావేరీ తుంగభద్రల స్వచ్ఛతనూ తీయదనాన్నీ
అపఘనంలో అలంకరించుకుంటున్నది.

తలపై నల్లవెంట్రుక నలుసంతైన లేకపోయినా
నిలువెల్లా తారుణ్యం తొణికిసలాడే

కమనీయ రూపం కన్నులకు విందు చేస్తుంది.
సుందర దరహాస వీచికలు దోబూచులాడే ముఖారవిందం
అందరినీ హాయిగా పట్టి నిలుపుతుంది.
గలగలా నవ్వినప్పటి సెలయేటి
మధుర నాదాల గిలిగింతలు
ఎదలలో మువ్వల సవ్వడులను ముంచి యెత్తుతూ ఉంటాయి.

తెలుగు మాగాణంలో విరుగ బండిన జానపద విజ్ఞాన
సంపదను ఎడద పాతరలలో భద్రపరచుకొని
తెలుగుజాతికి ఆమెతలు పెట్టి ఆనందిస్తున్నది ఆ తళుకు

తానేదో చెప్పాలనే తపన
దానికి మించి రసహృదయాల నుంచి
తానేదో ఆస్వాదించాలనే జ్ఞానదాహం
అచ్చమైన కవితాత్మలందించే రసఝురులను
తెలుగు పొలాలకు మళ్ళించాలనే ఆరాటం
చైతన్యం ఊపిరిగా కవిత్వం హృదయ స్పందనగా
కదులుతున్న రసవాహిని

పదిమంది యింటికి రావాలనీ
ధర్మపత్ని ఆప్యాయంగా అమరించి అందించే
రసోపేత భోజనాలను స్వీకరించి
గఱున త్రేన్చుతూ కదలాడాలనీ
కాంక్షించే ఆతిథేయ సౌందర్యం.

వ్యవహారంలోనే కాదు అభ్యవహారంలో కూడా
ఏ మాత్రమూ మొగమాటం లేని నిజాయతీ
ఉన్నంతలో అక్షరార్చనను చేసి
రాయలవారినో రాజరాజ నరేంద్రుణ్ణో
తలపింప చేయాలన్న ఆ కాంక్ష

ఇలా కాంతికిరణాలను వెల్లిగొలుపుతున్న
ఒక అద్భుత మందారమాల
మా ''తంగిరాల''!

* * *

# రెండు గజళ్ళు

-డా॥ రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు

## 1

భూమికి స్వర్గం దించడమేగా ప్రేమించడమంటే
ప్రేమను శ్వాసించడమె నిజంగా జీవించడమంటే 1

ఇంతటి అద్భుత సౌందర్యం నేనిపుడె కదా చూస్తున్నది
పిచ్చిమాట కాదా ఎవరైనా ప్రేమ గుడ్డిదంటే 2

ఎదురై తను వస్తున్నదిలా నిలువెత్తు గులాబీలా
కల్లమాట కాదా నిదురలోనె కలలొస్తాయంటే 3

ఎక్కడ తా నుంటే ఒక స్వర్గపు ముక్క అక్కడుంటే
కాని మాట కాదా తాను దేవ కన్యక కాదంటే 4

తన పేరుమీద మనసుపడి మారినది గుండె సవ్వడి - పార
పాటు మాట కాదా వలపు కన్న భక్తి గొప్పదంటే 5

ఇంత హాయి ప్రేమలోన ఉందని ఎరగను రెంటాలా!
ఒక పూలగంప ఐనది మది చెలి ఊహలు పడుతుంటే 6

## 2

పాటల బండెక్కిస్తా వస్తావా భాయి
పైసలు కాదోయి ఉత్సాహమే కిరాయి 1

ఆటవల్ల ఆరోగ్యం అని విని పుల్లాయి
చిత్తర పరిచాడోయి పేకాటకు పోయి 2

డబ్బుంటుందని దిగితే దెబ్బ తిందువోయి
జూదం అబ్బాయీ సారాయికి బాబాయి 3

చాకిరి చెయ్యని కళలు చిరాకను జీవులికి
సుందర శిల్ప మొక రాయి నెలవంక జులాయి 4

ఆదర్శం ఆ దాంపత్యం అంటానోయి
ఆమె కతను అతని కామె అయితే పాపాయి 5

ఎన్ని ఉండి ఏమి సుఖం ఇది బయటి బడాయి
అనునిత్యం మనిషికి తన మనసులో లడాయి 6

తరాల వెనకాల మనకు తాతలొకరె భాయి
నిన్న మొన్నటివి కులాలు నీ కెవరు పరాయి 7

చెట్టే తల్లోయి ప్రతి పిట్టా చెల్లాయి
ఈ సంసారంలో మనిషేగా అన్నాయి. 8

బ్రతుకంతా రెంటాలా! 'పాటసారి' నోయి
ఇప్పుడు పాటలూది చేయి నన్నొక సన్నాయి 9

* * *

# తెలుగమ్మ పాట

క్ృష్ణమ్మ మిలమిలల - గౌతమీ గలగలల
పెన్నమ్మ చిరు అలల - తుంగ భద్రాఝురుల
త్రుళ్ళింత లాడాయి - రతనాల నాఫలూ
రత్నగర్భవు నీవు తెలుగమ్మా!
సస్యశ్యామల వీవు మాయమ్మా!!

రుద్రమ్మా, మల్లమ్మ బాలచంద్రులవంటి
శౌర్యమూర్తుల గన్న తెలుగమ్మా!
కృష్ణరాయల గన్న మాయమ్మా!
తిక్కన్న పోతన్న త్యాగయ్య నన్నయా
కవి కుమారుల గన్న తెలుగుమ్మా!
కావ్య మూర్తివి నీవు మాయమ్మా!

అమరావతీ హంపి - అజంతా ఎల్లోరా
అందాల శిల్పాల మూర్తీభవించావు
కళాస్రష్టవు నీవు తెలుగమ్మా!
కర్పూర హారతులు మాయమ్మా ॥కృష్ణమ్మ॥

(ఈ 'తెలుగమ్మ పాట'ను ఎవరు రచించారో తెలియదు. సుమారు 50-60 సంవత్సరాల క్రిందట, శ్రీమతి నంబూరి పరిపూర్ణగారు, కాకినాడ పి.ఆర్. కళాశాలలో విద్యార్థినిగా ఉన్నప్పుడు దీనిని పాడేవారట. ఈమె ప్రముఖ అభ్యుదయ కవి డా॥ ఆవంత్స సోమసుందర్‌గారికి సహాధ్యాయిని. 31-3-2001 నాడు బెంగుళూరులో శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారింట్లో సోమసుందర్‌గారి అధ్యక్షతన జరిగిన కవితా గోష్ఠిలో శ్రీమతి పరిపూర్ణగారు ఈ కవితను తన 70 సంవత్సరాల వయసులో తిరిగి పాడగా విని తన్మయుడనై ఇక్కడ ముద్రిస్తున్నాను. దీని రచయిత ఎవరో తెలియదు. ''ఎవరో డాక్టరుగారు నాకు చిన్నతనంలో నేర్పారు. ఆయన పేరు తెలియదు'' అని అంటున్నారు పరిపూర్ణగారు. ప్రముఖ కవి, కథా రచయిత బెంగుళూరులో సాఫ్ట్‌వేర్ ఇంజనీరు అయిన శ్రీ దాసరి అమరేంద్రగారు ఈ పరిపూర్ణగారి కొడుకే! - తంగిరాల)

హైకూ కవిత:

# హైకూలు

## భద్రాచలం శశితేజ్

1. నదిలో
నక్షత్రాలు
ఇది వెన్నెల రాత్రి

2. పచ్చటి పొలంలో
చొరబడుతున్న
సర్పంలా – జలం!

3. చిమ్మచీకటి
మెలిపడ్డ బీరతీగె
ఈ కాలిబాట

4. జీవితానికి
కొస మెరుపు
వృద్ధాప్యం

5. తెల్లవారింది
ఇక ఈ చీకట్లో
ఎవరి దేవులాటవారిది.

## డా॥ యస్. బషీర్

1. హైటెక్ సిటీ
కుబుసం వదలినా
తత్త్వం మామూలే!

2. దుఃఖానికి ఆది
మనీ-షీ-కానే కాదు
నీ అత్యాశే!

3. కొన్ని ముఖాలు
అద్దం ముందు భాగాన
నగ్న సత్యాలు!

4. ఒక శ్వాసలో
కొందరి జీవితాలు
ఇమిడి ఉంటాయి.

5. నది స్వతంత్రం
తీరాల బంధంలో
లక్ష్యం అనంతం!

* * *

హైకూలు:

# ప్రకృతి ఒడిలో

(గత సంచిక తరువాయి)

–ఆసు రాజేంద్ర

59. పిల్లగాడు
పాటెత్తుకున్నాడు
కొండా, కోనా గొంతు కలిపాయి

60. కరెంటు తీగ
ఇల్లంతా పాకి
వెలుగుపూలు పూస్తోంది.

61. ముసలి తోట
పక్షుల్తో, పువ్వుల్తో
కాలక్షేపం చేస్తుంది.

62. కొబ్బరిచెట్లు, తాటిచెట్లు
పెనవేసుకున్నాయి
తుఫాను బంధం.

63. వెన్నెల కెరటాలు
అవని
క్షీర సముద్రం

64. పొగమంచు
కొండను
మింగేసింది.

65. తుమ్మెద
పూల సందేశాన్ని
మోసుకు పోతుంది.

66. ఒంటరితనం
గదిలో బొమ్మ
పలుకరిస్తోంది.

67. ఆరుబయట నిద్రలో నేను
చినుకులు
లోనికి గెంటాయి.

68. ఆకును తింటూ
అక్కడే నిద్రపోయింది -
పురుగు.

69. కొండకీ లోయకీ
ముడి వేసింది
జలపాతం.

70. చిలుక వాలింది
తనకదే వసంత మంది
మోడు.

71. చిగుళ్ళ మిఠాయి
తింటూ
పిట్ట పాపాయి.

72. చిలుక
కాకిలా అరుస్తోంది.
మనసు బాగోలేదు.

73. నిశ్చింతగా
చింత చెట్టు
ఊడల బాధ లేదు.

74. ద్రాక్షతీగ
నీలం గోళీలు
గుది గుచ్చిందెవ్వరు?

75. వరికంకి
పిచ్చుక
మాట్లాడుకుంటున్నాయి.

76. ఆకుమడి
పచ్చని తివాసీ
ఎవరికి ఆహ్వానం?!

77. తెల్లకొంగ
చేలో
మడి కట్టుకుని ఒక్కతే!

78. గడ్డివాము
తల్లి ధ్యాసే లేదు
దూడకు.

79. ఒంటి మామిడి చెట్టు
చిలుకలు
చంపుకు తింటున్నాయి.

80. వంగిన చెట్టు
ఎన్నాళ్ళిలా?!
నడుం నొప్పి పుట్టదా?!

81. తూనీగ
విమానాలు
పిల్లలకి దొరికి పోతున్నాయి.

82. కోతిపిల్ల
ఇంటి క్రాపు
చెడగొడుతుంది.

83. సెలవు రోజు
ఇంటికి
మాలీష్.

84. పిల్ల తెమ్మెర
వొట్టి పోకిరి
పిల్ల పైట లాగింది.

85. నా కాళ్ళ మధ్య
వెచ్చగా పిల్లి
శీతాకాలం

86. కెరటాలు
ఒడ్డుతో
కబాడీ ఆడుతున్నాయి.

87. తుంటరి తుమ్మెద
వెంట పడింది
పిల్ల జడలో పూలు

88. చంద్రుడా!
కాసింత వెన్నెల పొయ్యి
తాగి నిద్రపోతా.

89. గుళ్ళో దేవుడు
దివాళా తీసాడు
కొత్త మతాలు వెలిసాయి

90. గదిలో -
ఒంటరితనం
కరుస్తోంది.

91. కుంభ వృష్టి
కప్పుకు
నా యిల్లే దొరికింది

92. నీడ
కలిసిపోయింది
చీకటిలో.

93. ఎన్నాళ్ళిలా?
నడవగలనా?!
కొండ.

94. ఎగిరెగిరి పడింది
మిడత
తొండ నోట్లో.

95. పాత పెంకుటిల్లు
వర్షాకాలం
సణుక్కుంటుంది.

96. డొంక
నా మొహం చూసేవాళ్ళే
లేరు.

97. నది
ఒడ్డు
చెలిమి ఈనాటిదా?!

98. కాకి స్వగతం
గాడిలో పడ్డ
రికార్డు

99. పట్టపగలే
అరెస్టు చేసింది మబ్బు
సూర్యుణ్ణి.

100. నీటి బొట్టు
తామరాకు ఒడిలో
పాపాయిలా ...

101. అగ్గిపెట్టె
బడాయి సంతానం
బుగ్గిపాలు.

102. ఊడలమర్రి
ఉన్న సొత్తంతా
దిగబోసుకుంది.

103. ఎన్ని తామరలో
కొలను
ఎరుపెక్కింది.

104. దులిపేసుకుంది
సముద్రం
అనాథ గుడ్డి గవ్వల్ని.

105. లోకాన్నే మరచింది
తుమ్మెద
పువ్వుపై వాలి.

106. వేకువ వరకూ
నవ్వదు
మందారమొగ్గ.

107. చాకలిబండ
చావబాదుతున్నా
నోరు మెదపదేం?

108. చిలక కొట్టుడు
కాయ అదృష్టం
తీయనైంది.

109. అలా చూసుకోవడం
ఎంత కాలం?!
నింగీ, నేలా.

110. చినుకులు
పరదా కట్టాయి
చూరుకు.

111. విలపిస్తుంది
సముద్రం
ఏమి కోల్పోయిందో!

112. పువ్వులు
పిట్టలు సిద్ధం
కోకిల రాకే ఆలస్యం

113. బడి వదిలారు
కాన్వెంటు పక్షులు
స్వేచ్ఛాలోకంలోకి

114. దృశ్యమిక
నల్ల కాగితమే
సూర్యుడు దిగిపోయాడు.

115. కొలనుపై పిట్ట
అనుకరిస్తూ
అభిముఖంగా మరొకటి

116. నిరీక్షణలో కొండ
ఎవరి కోసమో?!
ఎంత కాలమో?!

(సమాప్తం)

* * *

పద్యకవితలు:

# గోదావరి పద్యాలు

-డా॥ యు.ఏ. నరసింహమూర్తి

వేగుంబోకల వెల్గురేకలిట నేవేవో మహాకావ్య వి
ద్యాగర్వోజ్జ్వల దివ్యదీప్తిదములై ఆనంద కల్లోలినీ
వేగోద్ధూత తరంగ మాలికలపై వేయేళ్ళుగా వెల్గె - నా
యీ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 1

ఈ గాలుల్ చెవిసోకు భారతకథల్ ఎన్నేళ్ళుగా తెల్గు లీ
మాగాణంబున పండు పుష్టికరమౌ మాధ్వీక మృద్వీకమౌ
వాగీశామృత రమ్యసస్యఫలమున్ వాకొంచు నాకొంటిరో!
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 2

వేగీ వైభవ మొక్కరాజు హృదయావిష్కార సంస్కార భాం
డాగారమ్మున లోతులన్నిటిని చాటంబంచెనో నన్నయున్
లోగీలోగని చచ్చుముచ్చు బ్రతుకున్ లోగొన్న దీ నేలయం
చీ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 3

శ్రీ గంధం బలదెన్ సరస్వతికి కాశీఖండ నిర్మాతయై
శ్రీగౌరీశుల భీమఖండ రచనన్ శ్రీనాథు డర్చించి తా
దోగెంగా కవిసార్వభౌముడగుచున్ దాక్షిణ్యగంగానదిన్
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 4

సాగెం గాటయ వేము జైత్రరథ మా సామ్రాజ్య నిర్మాణ రే
ఖా గీర్వాణము కాళిదాస కవితా వ్యాఖ్యాన సామర్థ్య మాం
ధ్రీ గౌరవ్య కథా సుధా జలధిగా ధీరాగ్రణీ సేవ్యమై
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 5

ఈ గడ్డే ప్రతిభా సముద్ర కెరటం - బీనేల పౌరాణికో
ద్వేగం బందిన దివ్యధాత్రి - యిదియే వీరేశలింగమ్ముగా
సాగై విప్లవ శంఖముల్ మొలుచు బీజావాసముం జేసె నా
యీ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 6

వాగుల్వంక లవెన్ని పొంగినను ఏ పాటైన గోదావరీ
భోగంబందునె? ఎన్ని కబ్బముల దిబ్బో భారతంబౌనె? పృ
థ్వీ గర్భమ్మున నన్నిలింగములు నా వీరేశలింగమ్ములే?
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 7

యోగాయోగము లోకముం గనుచు నవ్యోత్సాహియై సాహితీ
యాగారంభం బొనరించి దా గణపతిం ధ్యానించి - శీర్షమ్మునన్
పాగా చుట్టెను చిల్కమర్తియై గయోపాఖ్యాన నాట్యమ్ముగా
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 8

రాగాంధంబగు జీవితాధ్వమున నౌరా! భక్త చింతామణీ
యోగానంద చిరత్నకాంతి వసురాయోపాఖ్యమై రాణ్మహేం
ద్రీ గీః పాటవ మాంధ్రలోకమున నుద్దీపింపగా జేయగా
నీ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 9

దాగన్నేడును దివ్యశోభలవి మా దామెర్ల రామయ్య చి
త్రాగారమ్మున తెల్గుకుంచెల నజంతాచిత్ర సౌందర్యముల్
తీగల్ సాగుచు చేరుకున్నవిటగాదే! పౌరసత్వమ్ముగన్
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 10

కాగా యీ నది శంకరాభరణ రాగాలాప కంఠోర్మిగా
నా గానమ్మున బాపిరాజొకడు దివ్యావేశ ముప్పొంగగా
నేగెం దెప్పల దోగుచున్ సుకవితా క్షీరార్ణవోల్లంఘియై
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 11

సాగెం గౌతమి కోకిలా కుహుకుహూ చైత్రోదయారంభ మా
ధ్వీ గీతమ్ములు పంచమ స్వరమునన్ దీపావళీ స్నిగ్ధ తే
జో గర్భమ్ములు వేదులాహ్వాయుని కాంక్షోద్దీప్త భావమ్ములై
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 12

ప్రాగాంధ్రాళి పురాణకీర్తి మధునాపంతుల్ మహాకావ్య శి
ల్పాగారమ్మున శాశ్వతోజ్జ్వల ప్రభాభాస్వంతముంజేసె నా
రాగాలాపము మంద్ర మంద్ర రుతులన్ రాగిల్లు నీ యొడ్డునన్
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 13

నూగుల్ రాలని తెల్గుమాట తానూపెం బ్రబుద్ధాంధ్రుడై
స్త్రీగా పుట్టిన ప్రాణి బాధలను – మా శ్రీపాద ముద్రాంకితం
బే గాథంగదలించి చూచిన గులాబీయత్తరుల్ చిమ్ముగా!
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 14

లాగీ లాగని గొంతులోన మన మల్లంపల్లి పద్యధ్వనుల్
సాగీసాగని లోకమంత కొలువై సాన్నిధ్యముంజేయగా
ఊగీ ఊగని తన్మయత్వమున తా నున్మత్తముం జేయుగా!
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 15

ఈ గోదావరి నిన్న నన్నయది – నాదీనాడు – రేపింకొకం
డే గాథా ప్రచయమ్ము విశ్వజనతా తీర్థప్రదేశమ్ము కా
వ్యాగారమ్మును తీర్చిదిద్దు కవితా వర్షమ్ముగా నిల్చునో!
ఈ గోదావరి పారునంతవరకే నీ పద్యమే చెప్పెదన్. 16

(తెలుగు విశ్వవిద్యాలయంవారి పునశ్చరణ తరగతుల
కవిసమ్మేళనంలో చదివిన పద్యాలు)

* * *

# కవిత్రయ సమారాధన

-డా॥ రామడుగు వేంకటేశ్వరశర్మ

నేడు కవిత్రయార్చన; గణింపగ శారదయే జగంబునన్
పోడిమిఁ దాల్చె రూపముల మూటిని; అంతియె, వేరు కాదు, ఆ
జాడలు నిత్యమున్ దెలుగు సాహితికిన్ రుచిరమ్ములౌ నవే
గోడ లగున్ బునాదిగ నకుంఠితమౌ మన జాతి మేడకున్. 1

ఆదరణీయు డాదికవి యాంధ్ర కవిత్వ విశారదుండు; పు
ణ్యోదయమౌ లసత్ కవన హోమ వినిర్వహణైక కీర్తి సం
పాదన నద్వితీయుడు సుమా! మన తిక్కన; యెఱ్ఱనార్యుడున్
ఈ ధరలోఁ బ్రబంధ పరమేశునిగా పెనుపొందు యోగియౌ. 2

నలుమోముల్ గనరాని వేలుపగుచున్, నాల్గౌభుజాదండముల్
వెలయంజాలని శౌరియౌచు, నుదుటన్ వెల్గొందు నేత్రంపు జా
డలు స్పష్టంబుగఁ గానరాని శివుడై డాబొందు నా వ్యస మౌ
ని లసద్రూపములే కవిత్రయముగా నిర్మాణమున్ బొందెపో! 3

ఇలలో జీవనద స్వరూపముగఁ దానేపాఱుచున్ భూరి ని
ర్మల పుణ్యోదక వైభవంబునఁ బవిత్రత్వమ్ము నిద్ధాత్రికిన్
వెలయం జేయు త్రివేణి సంగమమిదే! పెంపొందు నాంధ్రంబునన్
విలసత్కీర్తిఁ గవిత్రయాత్మకముగా వెల్గొందెనంచెంచెదన్. 4

ఎది సర్వాగము సార రూపమయి తానెంతేని వర్ధిల్లునో
ఎది యేకైకము దైవతత్త్వ మహిమం బెంపొందగాఁ దెల్పునో
అదె యోంకారమె యిక్కవిత్రితయమై యావిర్భవమ్మై శుభ
ప్రదమౌ పంచమ వేదమున్ నిలిపె సంభావింప నాంధ్రంబునన్. 5

ఘన సారస్వతమైన జ్యోతితతి చక్కన్ నిల్పగా భూమిలో
నసఘం బౌచు పవిత్రమై యెసగు త్రేతాగ్ని స్వరూపమ్మిదే!
అనయంబున్ సుకవిత్రయాత్మకముగా నావిర్భవమ్మంది యొ
ప్పెను సత్కీర్తి నటంచు నెమ్మదిని భావింతున్ లసద్భక్తితో. 6

ఇది రసచంద్రికా వితతి యింపుగ గూర్చు కవిత్రయార్చనా
స్పద సుమహోత్సవమ్మటె? విచారము సేయ; సమస్త సత్కళా
భ్యుదిత వచోవిలాసుల మహోన్నతమైన సమర్చనమ్ము; శా
రదకుఁ గళావ్రతుల్ సలుపు రమ్యగుణప్రద యక్షరార్చయౌ! 7

ఈ యారాధన త్రిజగత్ గేయంబై, సహృదయులకు దివ్యానందా
మేయ ప్రజ్ఞా ప్రాభవ దాయకమై వరలుతన్ సతమ్ము శుభదమై! 8

* * *

## మా తెనుగు కైత

–ఆకుండి రామశర్మ

కమనీయ రమణీయ కవితను చెప్పిన
నన్నయ మా యింట నడచినాడు
ఘనమైన కందాలు మనసార పలికిన
తిక్కన్న మా యింట తిరిగినాడు
మందార మకరంద మాధుర్య మొసగిన
పోతన్న మా యింట పుట్టినాడు
ప్రభువుల మెప్పులు పలుమార్లు పొందిన
పెద్దన్న మా యింటఁ బెరిగినాడు

వాణియే రాణిగా నెంచి పల్కినట్టి
వీరభద్రుండు మా యింటఁ బేరుపొందె
మధురకవు లెందరెందరో మసలినారు
తెనుగు సాహిత్య రమ్య మందిరము నందు 1

నవ మంజు లాలాప నైపుణ్య మొప్పార
గురుహిత కృతులను గూర్చినావు
కరుణ రసాన్విత కమనీయ రచనల
నస్పృశ్యతాభావ మణచినావు

మాధుర్య సంపూర్ణ మాన్యశైలి నటింప
　　　స్త్రీ జాతి దశల చిత్రించినావు
వర్గ వర్ణ ద్వేష వాసనా దూరమౌ గుణమె
　　　భూషణమంచు గొలిచినావు

తేనె సోనల పూత మా తెనుగు కైత
నేల నాలుగు చెరగుల నింపినావు
అమల జీవన సుకవీశ! ఆంధ్రపుత్ర!
అందుకొనుమయ్య! నాదు జోహారు లివిగొ! 2

(ఆకాశవాణి, విశాఖపట్టణం కేంద్రం, 'కవితాస్రవంతి' లో ప్రసారితం)

* * *

## ఆ నలుగురికి

– డా॥ పంపన సూర్యనారాయణ

స్నేహితులార! నిశ్చలపు శీతల వాయువు బూరటిల్లు నా
దేహము చుట్టు మూగు పరిదేవకులం బెడబాపి, వారి వ్యా
మోహపు టశ్రురోదనల మూటను పాడెను బెట్టి, సాగునో
వాహకులార! మీరె నిజబంధులు, బైబిలు పొర్గువారలున్. 1

బంధుత కారణంబొ! అనుబంధ శతంబొ! గతంబులోన మీ
డెందములందు చోటును గడించితినో! పొరుగింటి వారలో!
కొందల మంది తప్పదను కోవకు జెందియు వచ్చినారొ! నా
బొందియె మీ కనాథ శవమో! మరి వట్టి కిరాయి వారలో! 2

ప్రాణ విహీన దేహము శవంబు, శరీరము లేక వాయువౌ
ప్రాణము, రెండు నైక్యమగు నప్పుడె జీవన, మొక్కపూటకే
స్నానము లేక ముక్కుగురు చచ్చెడి కంపును గొట్టు మేనులో
ప్రాణము దాటుకొన్న, నిక వాసన సైపగలండె రుద్రుడున్? 3

అట్టి వాసన భరియించి కట్టు గట్టి
నాదు కట్టెను మోయు మీ నల్వురకును
చితి మహాగ్నిలో నా రెండు చేతులొకటి
కాకపోవు! చివరి కృతజ్ఞతలు దెలుప! 4

*(తెలుగు విశ్వవిద్యాలయంలో పునశ్చరణ తరగతుల సందర్భమున మలికిపురంలో పనిచేస్తున్న పొన్నపల్లి శ్రీరామరావుగారు 'ఆ నలుగురి' గురించి వ్రాయాలని నన్ను ప్రేరేపించినారు. వారికి కృతజ్ఞుణ్ణి.)*

* * *

# మధుహేల

–అల్లంరాజు కామేశ్వరశర్మ

ఆమని చిరుబుగ్గ చిదిమి అత్తరువుల
ముంచి, విరిబాల నునులేత మోవి నలది
పసిమి పిందెల గాగరా పట్టు కుచ్చు
పరికిణీ గట్టె ప్రకృతి ప్రభాత వేళ!

పాల తరకల బాల కపోలములకు
ప్రొద్దుకుట్టని పొందమ్మి పొలుపు చాది
తేటి హొయసు రెక్కల వన్నె కాటుక నిడి
చివురు సవురు కుంకుమ దీర్చె చిట్టి నుదుట!

చిట్టి చివురాకు చేతుల చిన్నివ్రేల
కెంపు తళుకీను గోరట లింపు మీర
కడలి కౌమరిత కాలూనె ఘల్లు ఘల్లు
మనెడి సిరముువ్వ సవ్వడు లనగ వచ్చె!

గాలి ఊయల తూగులో తేలివచ్చు
చిన్నరి ఉగాది బాల సుశ్రీల లీల

వేప పూవుల కల్యాణ వేదిపైన
ముద్దులొలికించు మోహనమూర్తి హేల!

నవమి-రామ కల్యాణ లగ్నమ్ము వేళ
శివుని విల్ విరచిన వీర శేఖరుగని
మదిని ముదమారు తరగ లామనియుగాగ
పానకము బంచె చెఱకువిల్కాని రాణి!

* * *

## వినతి

-బులుసు సోమన్న

మమత పూలను పంచెడి మమ్ముఁగాంచ
లేక - మట్టుఁబెట్టగ నేల? లేమిఁజూప
నేల? భావదారిద్ర్యమదేల? ఏల
మానవత్వము భువిలోన మరచుటేల? 1

తేనెలు నొల్కు, బూవుఁగని - తీపుల గ్రోలగఁ గోయనెంచగా
తానొక పేదదానినని - తాలిమిఁ జూపుమటుంచుఁ బల్కెనో,
మానిత జీవనమ్మున - సుమాలుగ నీ వనియందునుండ - మా
మాన మొకింతఁ గావుమను మాటలు గుండెలు నిండె నంతటన్ 2

ఏటికి నొక్కమారుఁ గన నేటికి? యంగడిఁ జేర్చ నేటికిన్?
చీటికి మాటికిన్ విటుల చిందర వందర జీవమీను స
య్యాట లవేల? సాదరము నందగఁ జాలెడి మా ప్రయత్నముల్
నాటికి నాటికిన్ బ్రదుకు - నాశనమొంద సహింప నేటికిన్! 3

కొందఱు పాద పద్మములఁ గొందఱు రూపము - నామ కీర్తనల్
కొందఱు గాన సాధములఁ గొందఱు స్తోత్ర విశేషమందు - మీ
రెందఱు దైవ సాయమున నాశ్రయమంది - ప్రశాంత చిత్తమున్
పొందిన - పొందనీరుగద! పోరును సల్పు పురాకృతంబిదో! 4

పాలుజలమ్ముతోఁ గలియఁ బాల విధంబును పొందు రీతి - మీ
పాలనఁ గోరుచున్న తఱి - పాలసులై మము ద్రుంచివేయు పా
పాలను మూటఁగట్టుకొను వైనమదేల? దయా విహీనులౌ
టేలనొ? మౌనరాగిణుల మింతగ వేడిన గానరాదటే! 5

కలకలలాడు యౌవనపుఁ గాంతుల కాశల నొంది మీరు - మా
వలపుల యందచందములు వాసనలీన సదాశయమ్ముతో -
విలవిలలాడఁ జూచి - మము వేదనకున్ గురిచేసి - నెమ్మదిన్
కలతలఁ బెంపుఁ జూచుటయుఁ గర్మమొ । రాక్షస భావ సంస్కృతో! 6

చంచల భావ సంకలన సంపుటి - మీ నరజాతి నీతియు
న్నెంచగఁ - గృహ కర్మముల నెంచుచు - పంచుచుఁ దోటి వారికిన్ -
పెంచ మనోబలంబు నిడు ప్రేమ నొకించుకఁ జూపలేక - ని
ర్వంచనఁ జేసి కొందు వది నైజమొ । తత్త్వవదీయ దుష్కృతో! 7

బుద్ధుని బోధనల్ బ్రదుకు పూర్తిగ నింపెను కాని యిమ్మహిన్
బుద్ధుని మించు సత్కరుణఁబొంది నుతింప మరొక్క యోగ సం
సిద్ధులు లేరుగా? దయనశింపగఁ జూచెడి నీచభావనం
బిద్ధర వెలయకఁ జూతురు సహింపగరాని యచేతనంబునన్. 8

అనుచు వేడిన పూబాల యార్తిఁగనుచు
పాడు బ్రదుకున కర్థమ్ముఁ బల్కెననుచు -
వనము పుష్పించు ప్రతిపూవు దైవమనుచు -
కరుణ మేల్కొల్ప నా మదిన్ తిరిగిపోతి 9

* * *

*"Till taught by pain,*
*men know not what water's worth"*

**-Byron**

# మధుర స్మృతికి మృతి ఉండదు

-డా॥ మన్నవ భాస్కరనాయుడు

కమ్మని కవితా రుచి రా
రమ్మని నట్లుగ - చెలుముల రాణి కరము చే
కొమ్మని నట్లుగ వీరయ
నెమ్మది నవ్వుల కలుములు నిలుచును మదిలో! 1

నిండు పున్నమి రేయి పండు వెన్నెల హోయి
కురిపించు నీ చూపు కూర్మి వెలుగు
కమ్మ తెమ్మెర తీపి చెమ్మ చిమ్మిన దీప్తి
విరియించు నీ నవ్వు విమల కాంతి
జుంటి తేనెల సోన వంటి తీయని వాన
రచియించు నీ మాట రుచుల జిలుగు
తొలకరి చిరుజల్లు చిలికిన హరివిల్లు
వచియించు నీ మది వలపు శాంతి

లలిత సుకుమార సౌహార్ద రంజితమగు
నీదు వ్యక్తిత్వ వైభవ నీతి మాకు
ప్రక్క ప్రక్కనే నెలకొని ప్రణయ సుఖము
నడుపుతున్నది వీరయా! కడు ముదమున! 2

మహిపై సహనం నీవై
విహరించిన స్నేహితుడవు వీరయ్యా! నీ
సహవాసపు వాసనతే
తుహినాంశుని కాంతుల నిట దొంతర పేర్చున్! 3

*(ప్రియమిత్రుడు డా॥ నరాల వీరయ్య దివ్యస్మృతికి అంజలి ఘటిస్తూ)*

* * *

# హత్య

-ఆచార్య ఎం. కుల శేఖరరావు

ఏమి దారుణమ్ము, ఏమి యీ ఘోరమ్ము
మిన్ను విరిగి పడెను మీద బోలు!
బర్బరత్వరత్యమంత పరతెంచి వచ్చెనా,
ఏమి చెప్పగలను, స్వామి, కనుమ! 1

లోక సుందరముని నాకము వోలెను
వెలసియుండె నతడు వెలుగుచుండె
భాసురమ్ము శాంతి వ్యాపింప చేసెను
అట్టివాని గూర్చి యిట్టులయ్యె! 2

చీమ మొదలుకొనుచు చిన్మయ మూర్తికి
హింస వలదనుచు ఇంగితమ్ము
కలుగజేయు సామి, కన్నుల వెలుగులు
దోషమయ్యె మీకు దుష్టబుద్ధి! 3

భరత దేశమందు బంగారు వోలెను
ఉద్భవించినట్టి ఉన్నతుండు
దేశ దేశమందు దీప్తిని కలిగించె
మరచినారె, మీరు, మందబుద్ధి! 4

హింస యెచటనుండ ఇది మంచి కాదను
మాట చెప్పుచుండు మహిత మూర్తి
అంద రతని చేరి అందల మెక్కించ
చేటు మీకు కలిగె చెట్టబుద్ధి! 5

సన్నుతమ్ము నైన ఉన్నత రూపము
నవ్వు మొగమువాడు నవ్యుడతడు
మానవాళి నెపుడు మన్నించుచుండును
అతని గూల్చుటేల అంధులార! 6

లోకమంత శాంతి నాకము వోలెను
చేయవలయు ననుచు చేతమందు
పూని వచ్చియుండె, తానది సాధించె
హాని చేయమీరు పూనుటేల? 7

దివ్యమైన శాంతి దివినుండి భువిదాక
నిలిచియుండునట్టి పిలుపు నేడు
మానవాళి చూడు మన్నించి యున్నది
విగ్రహమ్ము కూల్చి విరుచగలరె? 8

మినుకు మినుకు మనెడు మిన్నుల తారల
వెలుగు మాపివేయ నేరితరము?
అక్షరాలు కాల్చ అజ్ఞానమే కదా!
మూర్ఖబుద్ధి మీకె ముప్పు దెచ్చు. 9

* * *

# వృషా! మృషాభిలాషముల్!

– జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

ఓ వృషనామ వత్సరమ! ఓపికతో వినుమొక్కమాట; నీ
వేవిధ మీ ధరిత్రిపయి వేడుకగా జనుదెంచు చుంటివో?
నీ వెటనైన విందువె ధునీగమనస్వర మంజురావముల్?
కోవెలగంటలున్ జనుల కోమల సంభ్రమ రాగ గీతముల్? 1

నరమేధ జనిత రుధిర ధారల ధరిత్రి
పూయించెను వసంత పుష్పములను,
కాశ్మీర జనహవ్య కవ్యముల భుజించు
రాక్షసమూకలే రంగు జల్లె,
పాంచాలభూమీ విపాటతాఖిల శాంతి
జనరక్షణోద్యమ జతుల నలిపె,

అసమ నక్సల్బరీ విశసనోన్మాదమ్మ
మారణకాండ కిమ్మీరమయ్యె,

నాగులో ఉల్ఫలో బోడో నాశతతులో?
పలు కిరాయి హంతకులో? పాపాల రేండ్లో?
భరతదేశమ్ము నెల్లెడ పాడు చేయ
నుద్యమించుచుండిరి వృషా! ఉద్యదబ్ద!
ఏమి చేతువో వచ్చి ఈ భూమిపైన? 2

ఫ్రీడం వచ్చిన నాటినుండి కనుమా! రేట్లన్ని మెట్లెక్కుచున్
చూడం జూడగ నింగినంటుచునె సంక్షోభమ్ము సృష్టించు, మా
గోడుల్ విందురె నాయకాగ్రణులు? మా గోరీల కట్టెంత్రు, ఈ
'ఫేడౌట్' జీవనరీతి మార్చగలవే - వేగన్ భవత్ ప్రజ్ఞతోన్? 3

ఆదాయమ్ములె శూన్యమై బ్రతుకు బోర్డాలిన్ విచిత్రమ్ముగా
ఆదాయోన్నత వర్గ బృందముగ నిర్ధారించి - 'సం-పన్నులన్'
ఏదో రీతిగ కట్టుమంచు పలుకున్ ఈ రాజ్య సూత్రమ్ము; నీ
వీ దారిద్ర్య విధానమున్ తొలగ జేసేవా? వృషాబ్ద ప్రభూ! 4

సామాన్యుల్ మరి మధ్యమ ప్రజలు వాసోదైన్య మార్గంబునన్
'రామా! మాకిక దిక్కు నీవె' యని భారాధిక్య శోకంబునన్
సేమంబించుక లేని జీవనములన్ చేసేరు - అదేమన్న, ఏ
నీమమ్ముల్ తలబాదు వీరలనె; కంటే నూతనాబ్దా! వృషా? 5

పేదలయింటి వంటలకు పెన్నిధియౌగద మంటినూనె! ఆ
వేదన కల్గజేసెనది; వేదికలెక్కి అమాత్యశేఖరుల్
సోదెలు చెప్పి, 'గ్యాసు' నిడు చోద్యము బాధ్యముగా వెలింగె; ఆ
పాదిత సూత్రముల్ బడుగు వర్గము నడ్డి విరుంగ జేసె; సం
పాదకవర్గ యోగ్యమగు పద్ధతులే యివి; నవ్య వర్షమా! 6

కనవినరాని కష్టములె కల్గె జనాళికి దేశమందు; ఎం
దున సుకమింతయేవి కలదో? క్షణమైనను శాంతిలేదు, శో
ధన జరిగించినన్ ప్రజకు దక్కదు భద్రత ఓ నవాబ్దమా!

మనవి వినంగ వేడెద నమానుషచర్యల వేగ(దుంచి, ఈ
జనుల మనంబులందున విశాల సహోదర భావవల్లరిన్
జననము కాగ జూడుము, భృశంబుగ మానవతా మహోన్నతా
ఘనతర కల్పవృక్ష లతికల్ మొలిపింపగ జేయుమెల్లెడల్! 7

మసిబూసి మార్చెదు మారేడు కాయలె
సర్కారు శపథాలు చవిటి చాళ్లు!
ఇంద్రజాల విశేష హిప్నాటిజమె తప్ప
పెనువృద్ధి గన నేతి బీరకాయ!
అంకెల గారడీ - సుంకాల గురితప్పు
పాటుబడుట - పెర్గు తోటకూర!
రామరాజ్య స్థాపనా మహోన్నత దీప్తి
కలనైన కనరాని గగన సుమము!

ఒకని గోచి లాగి ఒక తల తెగగొట్టి
పదవి పదిలపరచు నదను కొరకు
ప్రాకులాట తప్ప ప్రజలకై శ్రమపడు
వృషభ లాంఛను లెట? వృష నవాబ్జ? 8

నీ రాకతోనైన నిర్మలాంతఃకరణ
యుతులై జనులెల్ల నడువ వలయు!
నీ పాదచుంబన శ్రీ పదమై పృథ్వి
నిలువెల్ల పులకించి నిలువవలయు!
నీ నామ మాధురీ నిగమశ్రవణ పుణ్య
ఫలమంది లోకమ్ము వెలుగ వలయు!
నీ రమ్య వీక్షణా నీరదాచ్ఛాదనా
సుఖమందు విశ్వమ్ము సోలవలయు!

నీవు నినదించినను చాలు నీతి నిలుచు!
నీవు నిర్దయ దుర్మార్గ నీచ మతుల
పీచము నడంచి జగతి సంప్రీతి గనగ
శాంతి నిలుపుము! వృషనామ! సర్వగతుల! 9

# విషు - వృష పరామర్శ

- డా॥ మల్లేల గురవయ్య

1. విషు వర్షంబవా? వృషవో? విషు కర్థము తెలియరాక వృషవయితో? జ్యో
తిష శాస్త్ర మర్మ విదులగు - ఋషులెఱింగిన క్రాంతి వృత్త రేఖాకృతివో?॥

2. గుడితీసి వస్త్రసుడి నిడి - కడువడి కొమ్ము పెఱికి తలకట్టు నిడగ సం
దడి విషు వృషయయ్యె ననుచు- నుడివెడి కోవిదుల తలచి, నుతియింతు విషున్॥

3. కచ్ ప్రదేశమ్ముపై బిట్టు కచ్చె కలదొ - భుజ్ ప్రదేశమ్ము భుజియింప బూని భూమి
విచ్చెనోరు ప్రకంపనల్ పెచ్చరిల్ల - విక్రమాబ్దమిట్లయ్యె; నీ విషు నెఱుగము

4. ఓ విషు! విద్విషు వోలెన్, నీ విల విపరీత చర్య నెఱపక మాకున్
భావి శుభమ్ములు వర్థిల, నీ విజ్ఞత చూపి యేలి నెగడుమ నీతిన్ ॥

5. ఆంధ్రమందు బహువ్రీహియైన యపుడు
విషము కలవాని 'విషు'నిగా పేర్కొనెదరు;
ఆంధ్ర నిజము బహువ్రీహి, అన్నపూర్ణ;
నీవు సహజ ముకారాంతయై వఱలుము

6. జ్యోతిషశాస్త్రమందలి విషున్ బరికించిన సూర్యుడీ భువిన్
ప్రీతిని చుట్టువేళ వినువీథికి మధ్యగ క్రాంతివృత్తము
ద్యోతము; రెండు బిందువుల యొద్దన ఖండనసేయు, నందొకం
డే తనరున్ మహావిషు; విదే 'విషు' పర్వదినంబు కేరళన్ ॥

7. ప్రతివర్షంబిటు మార్చి-ఏప్రిలు నడిన్ వ్యాపించు పర్వంబు నం
ద్రితయాఢ్యమ్ముగ 'కౌనపూలు-కణి-కైనీట్టం' ప్రధానమ్ములౌ
ప్రతిగేహమ్ములరారు పూలగది; పిల్లల్ మామ లెల్లన్ మహా
ధృతితో నిచ్చెడి పారితోషకములన్ దృష్టిన్ గ్రహిం త్రీ విషున్ ॥

8. పూలగదిని పనసపూలు, పనస, మావి - ఉరుళిగిన్నె బియ్యముంచి కృష్ణ
విగ్రహమ్ము ముందు వెలుగ కొబ్బరిచిప్ప - దీపమిడి యలంకృతినిగన 'కణి'॥

9. ఇట్టి విశేషమ్ములతో - నెట్టన ప్రతివర్షమీవు నెగడుచు మలబార్
పట్టుగ; నటప్రజలలరగ; నిట్టుల 'విషు' అరువదేండ్ల కిట వచ్చెదవో? ॥

10. వృషనామంబుగ మార్చి యేర్పడితి; త్వద్విద్వత్తు విద్యుత్తు న
ట్లుషితంబై ప్రసరించునో? పురుష వీర్యోపాత్త సౌజన్యమై
తృషితుల్ వేడక దప్పి తీర్చుచు, సుబుద్ధిన్ గీష్పతిన్ మించి, కి
ల్బిషముల్ పూర్తి దహించి, ఇంద్ర విభవ స్ఫీతమ్మునన్ గ్రాలునో? ॥

11. అరటివయి, అంతిపురమయి, ఎలుక పడగ, ఎద్దు, గుట్ట, మెలుక వగుచు సం
బరపడెదో, దురదగొండిగ చరుముదో? బ్రతికింతువో మృత సంజీవనివై ॥

12. విషువైనన్ వృషవైనన్ – విషమ స్థితి చూపబోకు విక్రమువలె; శే
ముషి చూపి ప్రాణికోటిని – 'ఖుషీ' గ చూడుమిదె కోరుకొందు నిను విషూ!॥

* * *

# 'వృష' వర్షానికి స్వాగతోత్పలాంజలి

–విద్వాన్ పణతుల రామేశ్వరశర్మ

ఉ. స్వాగత మమ్మ! నవ్యతర వర్షమ! భారతవర్ష భాగ్యమా!
స్వాగత మమ్మ! దీనజన బాంధవ రూపక భాగధేయమా!
స్వాగత మమ్మ! నీ కరుణ సాదర మేదుర పుణ్యపూర్ణమై
సాగగ గోరుచుంటిమిఁక చల్లగఁజూడు వృషాఖ్య వర్షమా! ॥ 1

ఉ. ఎచ్చట జూచినన్ ప్రకృతి యెంతయు దివ్యమహత్వపూర్ణమై
ముచ్చటఁగొల్పు నట్లులిఁక ముందు ముదంబున నెల్ల సస్యముల్
పచ్చగ నుండఁ జూడుము, శుభంబులు పెక్కు లనుగ్రహింపుమీ
మచ్చరముల్ దొలంగి భువి మానవులెల్లరు సౌఖ్యమొందగన్ ॥ 2

ఉ. ఏమని విక్రమాబ్దము వచింతుము, చిక్కులు పెక్కులయ్యె వి
ద్యామహితుల్ లయించిరి గదా! యెటు జూచిన భూమి కంపముల్
సేమము లెల్ల డుల్చె, వివశీకృతమై కడుఁ గుందెఁ బో ప్రజా
స్తోమము, దైవయోగమున తుష్టిని బొందెడు మెల్ల మెల్లగన్ ॥ 3

ఉ. నీవయినన్ రవంత గణనీయ మనమ్మున మా మనోవ్యథల్
భావములందు నుండి తుడుపన్ సమకట్టుము, నీకు నిచ్చలున్
గావుత మంగళమ్ము; లెటు గాంచిన నా గ్రహ చంద్ర తారకల్
భావ శుభస్థితిన్ మెలయ, పావన రూపిణివై మెలంగుమీ ॥ 4

ఉ. ధారుణి సర్వసౌఖ్య సముదాయము, సత్కవి పండితాళి స
త్కారము, దీనమానవులఁ దన్పగ వస్త్రము, కుక్షి నిండను
హారము; వైరిభావ పరిహారముఁ గూర్చుచు లోకులెల్లరున్
హారతినీయ సాగు మహహోద్యములొప్పు వృషాఖ్య వర్షమా! 5

* * *

# సంసార బాధలు

–చిలకల వెంకటసుబ్బారెడ్డి

1. ఉప్పు కొఱత యున్నప్పటి – చప్పిడి మెతుకులు పిడికెడు చాలును జీవా!
పప్పన్న మవసరంబని – అప్పున బడితిమనగానె అగచాటులగున్.

2. ఆలి విడిచె రాము, డటులె – ఆలిని విడనాడి నలుడు అగచాట్లు పడెన్,
ఆలి హరిశ్చంద్రుడు గ – య్యాళి మగని కమ్మె – ఇల్లె అగు నిల్లాలున్.

3. ధనమున్నవాని కిహమున – గుణమున్నను లేకయున్న కులము పదవియున్
తన తోడ కలిసి వచ్చును – గుణవంతుని కీర్తి నిలుచు కువలయమందున్.

4. శని దేవుని దయగలిగిన – తనివారగ శుభము సుఖము తనరు నరునకున్
శని దయ తప్పిన యెడలన – శనివారము నెత్తిపడిన సరణి వ్యథలగున్.

5. దుఃఖము సంసారం బది – దుఃఖము జన్మయు జనులకు దోషము జగతిన్
దుఃఖము జరయును జీవా! – దుఃఖములను పొందబడని త్రోవను గనుమా!

* * *

# ఆమని ... ఏమని?

–'శతావధాని' కొండపి మురళీకృష్ణ

ఆమని కోయిలమ్మ గళమందు స్రవించు మనోజ్ఞ గీతికా
దామ సుధాఝురీ మధురతా సముదీర్ణ తరంగడోల తా
నేమని విన్నవించె? వినదించెడి మానవతా గుణమ్ముతో
ప్రేముడి రంగరించుమని విన్నపముల్ బచరించె గాంచుమా!

ఆమనితోట తల్లి యొడియందున తావుల గుస్తరించి శో
భా మహనీయతన్ నయనపర్వ మొనర్చెడి పుష్పమంజరుల్
యేమని బోధచేసె? వికసించెడి తావక దివ్యమానసా
రామమునన్ దయారస మరందము నించుక నింపుకొమ్మనెన్.

ఆమని వేళ క్రొత్త వధువై హరితత్వపు తీపి సిగ్గనే
యామెతగాగ జేసి చిరుహాసము చిందుచునున్న భూమిజ
మ్మేమని పల్కుచుండె? మది నేచు నిరాశను గెల్వ మాశచే
ఆమని నీ మనోవనము నందు రహించు నటంచు పల్కెడిన్.

* * *

# అవధాన కవిత

(సమస్యా పూరణలు)

–అల్లంరాజు కామేశ్వరశర్మ

1. ఉద్యోగము లేని వరుడె యువతికి నచ్చున్!

వేద్యుండున్ ఘన సుమనో
హృద్యుండును సుగుణశీలి – ఇమ్మగు వాడున్
విద్యావేత్తయు; వరశు
భోద్యోగము లేని వరుడె యువతికి నచ్చున్!

ఇదే సమస్యకు మరో రకంగా పూరణ:

మద్యము ముట్టని వాడును
పద్యములన్ వ్రాయువాడు - బహు విద్యలచే
హృద్యుండును, గుణశాలి ని
రుద్యోగము లేని వరుడె యువతికి నచ్చున్!

2. భామా! నే భామ నౌదు, భర్తయు నౌదున్!

వామార్ధజాని యిట్లనె
హైమా! నా తనువులోన అర్ధము నీవై
నా మాదిరి నుండగ - పుం
భామా! నే భామ నౌదు భర్తయు నౌదున్!

3. పడమటి దెసయందు బాలభానుడు పొడిచెన్.

పుడమిని శ్రీ మండేలా
గడగడలాడించి శ్వేతకాయుల నోడిం
పడె, మండేలా రూపున
పడమటి దెసయందు బాలభానుడు పొడిచెన్!

4. బుద్ధి లేనివాడె బుధవరుండు!

సమత మమత తోడ సాధువర్తన గల్గి
పరమ భక్తి గలుగు వర గుణుండు
మానవత్వముండి - మత్సరంబును, దుష్ట
బుద్ధి లేనివాడె బుధవరుండు!

5. సారా త్రాగిరి పండితోత్తములు ప్రజ్ఞాపాటవ ప్రాప్తికిన్!

సారాసార వివేక విజ్ఞులు, కళాసాహిత్య సంవేద్యులున్
ధారా ధోరణి చెన్నుమీర కవితా ధ్యానమ్ముతో ఆశువా
క్సారా! - త్రాగిరి పండితోత్తములు ప్రజ్ఞాపాటవ ప్రాప్తికిన్
ధీరోదాత్త కవిత్వతత్త్వ రస వాగ్దేవీ కృపాస్తన్యమున్.

(సశేషం)

ధారావాహిక పద్యకావ్యం:

# మల్లీ! ఓ మల్లీ!!

(జానపద శృంగార పద్యకావ్యం)

(గత సంచిక తరువాయి)

-జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

అది పోనీలె, మరోటి సెప్త విను! దయ్యాలయ్య గూడురులో
సదివింపుల్ పెడదామ బావ! జత వస్తావాని నీ వడ్గితే
పద పోదామని వస్తిగాదె? బయమై వల్లోన నా మల్లి! నీ
వదిరే గుండెతొ వాలితే పాదివి సంబాలిస్తినా లేదటే? 50

రమ్మంటే పదమంట వస్తి జతగా రానా యనంటేను నే
రమ్మన్నాను వుసారు జేసినది నీ రాజ్జమ్మె పేమంటు దా
నమ్మంటల్లరి సేసినావు నెరజానా! మల్లి! నానాక మా
యమ్మాటల్తొ గిరాటు కొట్టి యిపుడో యమ్మీ! పరాకిస్తవా? 51

ఒసినీయమ్మది సల్లగుండ! సెపవే ఓ మల్లి! నే నెప్పుడై
న, సరాగాలయి తీస్తినా? వలపుకూనా! రాయె, రామంటినా?
నస నీవేగద లేవదీసితివి, నన్నా రచ్చ కెక్కించినా
వసలీ తంతుకు నీవె కారనము; ఈవాలేమొ కాదంటవే! 52

రాయే మర్దల కాయిలించుకొని నోరారీయవే ముద్దు నా
తాయిల్లమ్మవె నీవనంచు మరి నీ తాంబుర్ర వాయిస్తినా?
నీయవ్వా! గురిపెట్టి గుండెలకు గన్నేరాకు కన్గొట్టి నీ
వేయవ్వారము మల్లి! సాపి యిపుడో వెవ్వే! యనంటావటే? 53

ప్రేమిస్తానని యంటెనా? అసలు నీ పేరెత్తి నే పిల్స్తినా?
మామా అంటవు, నా కుసాలి మగడా! మాటాడరా యంట వీ
పేమా గీమల సంగతేమి తెలదే పిల్లా! ఒసే మల్లి! అం
టే, మార్పుల్కవు, అన్నిసేసి ఇపుడో? టేకంటవే గడ్సరీ! 54

నీ వయ్యారము నీ సలాకితన మన్నీ నాకె సొంతమ్మనీ
నా వాల్లందరితో గసంగ సెపితే నవ్వింద్రె నావాల్లు, 'పో
రా! వెంగాయివిరా! అదేడ నినురా? రమ్మందిరా? వుత్తిదే
పోవో!' అన్నరె మల్లి! కూత నిజమై పోతాదె, రారాదటే! 55

నిన్నా మర్సను సొతగాదె! మనువంటే నీవు కాదంటవే!
నన్నా వద్దని సెప్పవట్టె సరెలే నాతోన వద్దంటవే?
అన్నన్నా! ఇది ఎట్టె తేలుతది? వలపేనా? కాద తెంచెయ్యవే!
సన్నాసుల్లో జమౌత; పోతనిక నా సామీ! మల్లి! సత్తెమ్మిదే! 56

మల్లీ! ఏమనబాకె నీ మవునమే మాయింట మావూర న
న్నెల్లా గుండక నీక వూరిడిసి పొయ్యేలాగ సేసిందె; నీ
వల్లన్గాదె మటం బికారులతొ సావాసించి బైరాగినై
పల్లెల్ బస్తీలు మల్లి! తిర్గుతానె! రావా! అంటె, నేవస్తనే! 57

కర్నూలొస్తిన? ఏమి సొక్కెమని సింగారించి నే సెప్తునే?
ఆర్నాల్లోమలె పిచ్చి పిచ్చిగ జనం తిర్గుల్లు పర్గుల్లు పో
సెర్నాకోలతొ కొట్టితే వురకలేసే గిత్తలే మల్లి! నీ
సిర్నవ్వుల్ కనిపిస్తవా? నిలకడా? సీ! ఏమి బావుండదే! 58

నమ్మించావు కదోసి పూలసెలువా! నా పేనముల్ తీసి, నీ
యమ్మేమొ తీగవేసి సెప్పినది 'పోరా! అమ్మి నీ దారి కా
దమ్మమ్మా! అని; నీవొ మల్లి! పలికే దారేది లేదాయె; నా
సొమ్మంతా తినివేసి కూడా ఒక పూసో పాడో సూపింపవే? 59

నిదరోతుండిన బేవరాసిని ఒసే! నీయవ్వ! లేపావు; నీ
సొదితో పేమలు గీమలంటు బలె వాల్సూపుల్ విసారించినా
వదెపో తప్పనిసెప్త! అన్ని మొదలై వాటారు పొద్దుల్ల నీ
మది యేందే? మరుమల్లి! నన్నిడిచి పో మావాని, యేడ్పిస్తివా? 60

నాయమ సెప్పవే తులువ నాచి! నికార్సుగ నిన్నె నమ్మినా
నా? యమగాటుగా వలపునంత పరిస్తిన? లాబమేమిటే?

ఊయెల మల్లి! నా పెరిమ వుత్తది సేస్తివె? కొంప ముంచితే!
నీయలవాటిదా? మనిసే నేనని నీ మతి కెక్కదేమిటే? 61

నీ మూలాన కదే పొలంపనులు సందేల్పొద్దు దారయ్యె; అ
మ్మేమో నా పరిసీతి సూచి దిగులై యే గంగలో దూకెనో?
ఓ మల్లీ! రుసి తప్పినాది; నిదరే వుస్కాకి; నా కాకలే
దూమన్కై సగమైతినే బతుకు పండో కాయొ! నీ బాగ్గమే! 62

మావా! పానెము నీవె యంటివి కదే! మల్లీ! నిజం కాదటే!
ఈ వేసంతొ దివానలాగ తిరిగే ఈనున్ని సూడాలనా?
నీ వల్లా ఎగవేసినావు! సెపవే! నీ తోడు నేనేమొ నీ
పై వల్లంగి పులుంగు మాదిరికదే పానాలు తోడేస్తినే! 63

సత్తర కాయినై జనము సందడిలేని మొగాల మూల, ఓ
బిత్తరి కల్ల మల్లి! తినివేసిన యిత్తరి మల్లె పండి, నీ
సిత్తరువే తలస్తు నువు సేసిన బాసల వూసులన్ని నా
సిత్తము గుల్లసేస్తి, కురిసే వరుసమ్మయిపోతి సూడవే! 64

నీ సురకత్తి సూపులు మునీసులనే అడలేసె, నవ్వు లో
సీ సినదాన! మల్లి! నిమిసేమయినా నిదరేదిరాని తీ
రే సెలరేగి సంపుతయి; రేవగలంతను సింత నీపయే!
ఏ సని పట్టినాడొ కదనే! నువు మార్తివి, నేనిట్టైతినే! 65

తిరుపతి పోతినా? నిలిసి తీరుగ సామిని సూడలేదు, నీ
కొరకొర సూపె సూపినది కొండలరాయని మూతికూడ! ఆ
తిరుతనిపోతి ఆడ? అరె! తియ్యగ నవ్వుత నీ మొగమ్మె - ఏ
మెరుగని నంగనాచి మొగమే అనుకొంటిని మల్లి! సిత్రమే! 66

(ఇంకా ఉంది)

అనువాద కవిత: (ఆంగ్లం)

# పాకిస్తానీ స్త్రీవాద కవితలు

(గత సంచిక తరువాయి)

("We the Singal Women" అనే ఆంగ్ల కావ్యం ఆధారంగా)

– అనువాదం: **అంబికా అనంత్**

## 11. రాజీ

వెచ్చనిది, సుతిమెత్తనిది ఈ 'ఛాదర్'
'రాజీ' అనే దీని నేతకు ఎన్నేళ్ళో పట్టింది
'వాస్తవం' అనే పూలు దీనిని అలంకరించవు
ఒక్క తప్పు అల్లిక కూడా దీన్లో లేదు.

నా శరీర ఆచ్ఛాదనకు చాలు ఇది
కాస్త ఓదార్పు కూడా ఇస్తుంది ఇది
మాకు సుఖాన్ని ఇవ్వకపోయినా
మీకు దుఃఖాన్ని కలిగించదు.

మా మీదుగా పరిస్తే, మాకు ఇల్లు అవుతుంది
మా క్రింద పరిస్తే, ఒక వనమై వికసిస్తుంది
పైకి ఎత్తితే, మాకు పరదా అవుతుంది.

– జెహరా నిఘా

## 12. అంకితం

నేను మా నాన్న కన్నా ఎత్తు ఎదిగాక
మా అమ్మ గెలిచింది.

– ఇషరాత్ ఆఫ్రీన్

# 13. గజల్

సున్నితమైన ఈ కన్నె నాలో దాక్కునుంది
వింత దృష్టి కోణం, వింత మనోభావం ఈమెది.
నా చేతులు ఎందుకు రక్తసిక్తమో చెప్తాను నేను
నా చేతుల్తో రాయిలో నుండి చెక్కాను ఈమెను.
నాస్తిక భావాల ఆలయంలో నిలబడి ఉంది ఈమె
గాయపడ్డ చేతుల్తో
ఆమె అభిమానాన్ని వాళ్ళు దోచుకున్నప్పుడు
దుఃఖంతో కనుమూసిందామె
అంత సున్నితమైన కన్నె, నాలో ఉన్న ఆమె!
నాపై ఆరోపణ ఎందుకు ఈ కళాఖండం గురించి
నేను కాదు దాని చిత్రకారిణి
ఆమె అసంఖ్యాకమైన స్ఫటికాలుగా చెదిరిపోతుంది
ఆమె కుసుమ ప్రేతంగా ముడుచు పోతుంది
జమీందారీ భవంతిలోని వారు
వాళ్ళ ఇంటి పిల్లను వారే ఉంచేసుకున్నారు.

# 14. పరిచయం

ఎవర్ని నేను
పాత గాయాల్ని మళ్ళీ రేపకు
ఎవర్ని నేను
నువ్వు అనుకున్న దాన్ని కాదు
మా వీథుల్లోని ధూళి దుమారంలో
ఆడుతూ పెరిగాను నేను
నా తోటి వయస్సులు కలలు కంటూంటే
నేను పోరాడటం నేర్చుకున్నాను.
మా తాత తండ్రుల సమాధులపై
వికసించిన ముచ్చటైన మొగ్గను నేను

ఉనికి ఉన్నందుకే చిరునవ్వుతో
శిక్షలు అనుభవించాలి నేను.

నాకు పేరు లేదు
ఘనుడైన 'గాలిబ్' పేరుతో పిలుస్తారు నన్ను
దారిద్ర్యంలో కొట్టుమిట్టాడి అంతమొందిన
కవిరాజు 'మిర్' పేరుతో పిలుస్తారు నన్ను
మధువు కోసం బిచ్చమెత్తిన
ఘనుడు 'గాలిబ్' పేరుతో పిలుస్తారు నన్ను!

– ఇషరాత్ ఆఫ్రీన్

# 15. గజల్

చల్లబడ్డ పెదాలమీద చేదురుచి ఆకలిది
రక్తం ఓడుతున్న, పగిలిన, ఎండిన, పచ్చని పెదాలు
విరిగిన గాజు, మంచుముక్కలాంటి పిల్ల, తిరుగుబాటు వయసు
ఆకుపచ్చని శరీరం, రాతికళ్ళు, నీలి పెదాలు
ఖాళీ ముంగిలి, ఒంటరి ఆడది, దీర్ఘ క్షణాలు
రిక్త నయనాలు, తడిసిన చెరగు, తడి పెదాలు
చేదుమాటల నీలివిషం
ఈ పెదాల పై పొరల్ని తినేస్తుంది
ఆ విషాన్నే మరీ కోరుకుంటూ, తేనె మంచును నిరాకరిస్తూ
తిరుగుబాటు చేసే, మొండి, ఉన్మత్త, మూర్ఖ పెదాలు
ఉపేక్ష భావాలు, చేదు భాషలు
అందమైన, సున్నితమైన, ఎర్రని, రసభరితపు పెదాలు
అందరూ ఈ విషయం గురించి ఏమంటున్నారు?
ఆడపిల్లల్ని, వాళ్ళ పెదాల్ని అతికించేసుకుని
గట్టిగా మూసుకొమ్మంటున్నారు!

– ఇషరత్ ఆఫ్రీన్

# 16. గజల్

వాళ్ళు జీవితాంతమూ వైవాహిక సుఖం కోసం ప్రార్థనలు విన్నారు
కానీ, వాళ్ళే వాళ్ళ గాజుల్ని బద్దలు కొట్టుకున్నారట
(ఆత్మహత్య) మద్యపానం వలన
సంప్రదాయమనే విషం జీవితానికి సరిపడేంత ఉంది
దుఃఖాల్నుండీ, పరదాల్లోకి ముడిచి పెట్టేశారు మమ్మల్ని!
మా గ్రామంలో పంటలనేవి లేవు
మా పరదాలకు గులాబీల రంగులద్దడానికి
గాలి కూడా, దీనులైన ఋతురాణుల వస్త్ర
సుగంధానికి ఋణపడి ఉంది
ధూళిలో సృష్టి గీతాలు వ్రాసే ఆ చేతివ్రేళ్ళను
చుంబించటం కూడా పాపమేనేమో
ఈ ఏటి పంటల మీద సుంకాన్ని ఎవరు దోచారో?
ఈ పైర్లు ఎవరివో... ఎవరు సొంతం చేసుకుంటారో?
చూడు మరి ....

– ఇషరాత్ ఆఫరీన్

(సశేషం)

''కళలో సామూహిక తత్వం విధిగా ఉండి తీరాలని నేను సూచిస్తున్నాను. ప్రస్తుతం మనకున్న క్షీణనాగరికత కళలనుంచి సామూహిక తత్వాన్ని వేరు చేస్తోంది... కళల వల్ల సమాజంలో కలిగే చైతన్యం ఎంత ముఖ్యమైందో, జీవితగతి ప్రభావం చేత కళలలో కలగవలసిన చైతన్యం కూడా అంతే ముఖ్యమైనది ... స్త్రీల అభ్యుదయం సోషలిస్టు సామాజిక విప్లవం మీద పూర్తిగా ఆధారపడి ఉంది''

– కొడవటిగంటి కుటుంబరావు

''తాను వేరు, తన కవిత వేరు అనే వేర్పాటు కవికి కుదరదు. దీపమూ దీప్తీ వేరు కానట్లే, జాబిల్లీ వెన్నెలా వేరుకానట్లే - కవీ కవిత్వమూ వేరు కాలేవు''

– డా॥ ఆవంత్స సోమసుందర్

అనువాద కవిత: (ఒరియా)

# కళాకారుడి కొడుకు

- కుంతల కుమారి సాబాత్

కళాకారుడి కొడుకుని
పరిశ్రమల్లో ప్రావీణ్యుణ్ణి
శిల్పిగా
ప్రపంచమంతా మెచ్చుకునేలా
దూరదూర తీరాల్లో పరిచితుణ్ణి

సుత్తీ ఉలితో ఇనుమునికూడా నలగ్గొట్టి
ఆకాశాన్ని తాకే గోపురాల్ని కట్టాను

రాళ్ళమీద రాళ్ళు పేర్చి
అబ్బుర మనిపించే ఆనకట్టలూ కట్టాను

అపరిచితులు ఆశ్చర్యంతో చూసేలా
ఒరిస్సాని ఆలయాల తోరణాలతో అలంకరించాను

అయినా అందరికీ తెలిసిందే!
నేను విశ్వకర్మ కొడుకుని
ఖర్మ!
దరిద్రం ఎప్పుడూ నా చుట్టూనే!
కూలీ కోస మిప్పుడు పనిముట్లు మోసుకుంటూ
ప్రపంచమంతా దేశద్రిమ్మరిలా తిరుగుతున్నాను

నా సుత్తి
నా గొప్ప గొప్ప శిల్పాలు
ఎప్పుడో కనుమరుగయ్యాయి

అగమ్య దేశంలో
అగచాట్లు పడుతూ ఇక్కడ పడున్నాను.

ఆకలికి అలమటిస్తూ
గుడ్డలైనా లేని నా పిల్లలు
అవసరాన్ని తీర్చుకుందుకు
అప్పులు చేస్తూ నేను.

ధర్మపథపు మహానుభావుడూ లేడు
ఎక్కడున్నావు అనడిగే కొడుకూ లేడు

ఎలాగో ఏకాంతంగా అవమానభారంతో
తండ్రెక్కడో దూరప్రాంతాల్లోనే నెట్టుకొస్తున్నాడు
అతని శరీరమిప్పుడు రాయికంటే కొయ్యకంటే గట్టిపడింది
ఒకప్పటి ఖ్యాతిని ఎప్పటికీ ఇంక మర్చిపోవలసిందే!

మా ఏడుతరాల్లో ఎవరూ బానిసత్వంలో మ్రగ్గలేదు
భవిష్యత్తు మాకింక అంధకార బంధురమే!

ఘనాఘనా గజపతువే గతించారు
మమ్మల్ని పట్టించుకునే నాథుడెవరు?
ఈ దీపాలింక ఎప్పటికీ వెలగవు!

అపరిచిత ప్రాంతంలో
కష్టాల్లో ఏదీ దొరకక ఏదీ చిక్కక
పరువునే పణంగా పెడుతున్నాం

కళాకారుడి కొడుకుగా
నా గుండె పగిలిపోతోంది
నే నింక ఏ బానిసత్వాన్నీ భరించలేను

నా కళా నైపుణ్యంతో
నేను పుట్టిన నా దేశాన్ని
దాని ఖ్యాతిని వ్యాపింపజేస్తాను

ఒరియా శిల్పి అందరినీ చకితుల్ని చేస్తున్నప్పుడు
నే నెందుకు బానిసత్వంలో బండబారటం?
దేశ గౌరవాన్ని భంగపర్చటం?

ఇంకొద్దు
ఈ బానిస బ్రతుకే వద్దు
నా సొంత గడ్డకే తిరిగిపోతాను
మిగిలిన బ్రతుకు ఇంకెలా ఉన్నా సరే!
ఇంకెలా ఉన్నా సరే!

అనుసృజన: వెల్దుర్తి హర్షవర్ధన్, వై. ముకుంద రామారావు

* * *

అనువాద కవిత: (కన్నడం)

## వేరే ఊళ్ళో

– అగ్రహారం కృష్ణమూర్తి

వేరే ఊళ్ళల్లో తారసపడేవాళ్ళు
చేయీ చేయీ కలిపి నడిచేవాళ్ళు
కలిసిపోయి కబుర్లు చెప్పి నవ్వుకునేవాళ్ళు
ఎన్నడో మన ఊరు వదలి
వలస వచ్చిన వారేమో అనిపిస్తారు.
మరిచే పొయ్యాను గదయ్యా
అంటున్నట్టుగా కౌగిలించుకుంటారు.

వేరే ఊరిలో, వేరే భాషలో,
ఇదిగో ఈ సందులోనే యిల్లు,
అదిగో ఆ చెట్టు ప్రక్కనే,
రండి ఒక్కసారి ఇంటికి
వచ్చి వెళ్ళరూ అంటూ
ఎన్నడో వారి యింటిని వదలి వచ్చిన
వాడినేమో అన్నట్టుగా
లాక్కుని పోతారు.
మరచిన గురి గుర్తొచ్చినట్లూ
ఎరుగని గుమ్మం యెరుకఅయినట్లూ
ఒకటి - రెండు - మూడు మెట్లు
ఎక్కుతున్నప్పుడే నా కోసమే
కాచుకొని వున్న తెఅుచుకునే తలుపులు.

చాపిన చేతుల్లో పానకం,
జున్ను గుజ్జు మామిడిపండ్లు
మీకు నచ్చినవే సుమా అంటూ
నవ్వే వారి సుధలు నిండిన కన్నులు
మర్చేపొయ్యాను గదయ్యా
ఎన్నేళ్ళు, ఎంత ఆనందం!
పరిచయాల పోకడలు - వింత గతులు.

అనువాదం: తెన్నేటి రాజశ్రీ మీనలోచని

''సాహిత్యాన్ని జాతి (కులం) ఆధారంగా పరిశీలించే, విశ్లేషించే స్వభావం కాదు నాది. సుఖదుఃఖాది భావాలు సమస్త ప్రాణికోటికీ, మానవులకూ కులమత భేద భావాలు లేకుండానే ప్రాప్తం అయ్యే సంగతులు''

– డా॥ శివరామ కారంత్

(అనువాదం: ఘట్టమరాజు)

అనువాద కవిత: (కన్నడం)

# నన్ను అంటరానివాణ్ణి చేసిన ...

-మూడ్నాకూడు చెన్నస్వామి

నా స్వాభిమానాన్ని
రగలబెట్టే మతం నా కొద్దు
నా ఆత్మగౌరవం పై
దాడెత్తే మతం నా కొద్దు
నా గౌరవాన్ని
మట్టగించే మతం నా కొద్దు
'నా' తనాన్ని
వెక్కిరించే మతం నా కొద్దు
గయ్యాళికే మిన్న - ఘనత
చాకలికన్నా నిమ్నం - మర్యాద
ఈ అబద్ధపు వ్యక్తిత్వం
ఇంతటి దయనీయమైన నా ఉనికి
నా కొద్దనే వొద్దు!

అనువాదం: తెన్నేటి రాజశ్రీ మీనలోచని

'చైతన్య కవిత' కవులకు, పాఠకులకు

## ఉగాది శుభాకాంక్షలు

కాల మనంతమైనది, జగంబు విశాలము, జీవయాత్ర కా
ర్యాలయ, మిక్కడున్న ప్రతిప్రాణియు సింధువునందు బిందువుం
బోలగ, తోటివారి యనుభూతుల తోడుగ, సాహితీ కళా
లాలసులైన మీకగు నిరంత వసంత లతాంత సంపదల్!

విషు ఉగాది — డా॥ పంపన సూర్యనారాయణ
25-3-2001 (పెద్దాపురం, తూర్పుగోదావరి జిల్లా)

అనువాద కవిత: (ఆంగ్లం)

## మూలం: Self Negotiation

**-Alexander Pope**

Thus let me live unseen,
unknown
Thus unlamented let me die
Steal from the world
And not a stone tell
where lie.

## అనువాదం: వైరాగ్యం

- యరమాక ఆదిశేషారెడ్డి

ఎవరి కంటబడక, ఎవరికి తెలియక
బ్రతుక నిండు నన్ను వెతలబడక
మరణించు సమయాన దరిజేరి కన్నీళ్ళు
పెట్టు వ్యక్తియేలేక గిట్ట నిండు
ఈ ప్రపంచములోన ఎవరు గుర్తించక
నను శాంతిలో జారుకొనగ నిండు
నను పూడ్చి పెట్టిన నాదగు స్థలములో
నిద్రబోవగనిండు నిశ్చలముగ

నా వలికి పరిసరంబుల నన్ను గూర్చి
తెలియజేసెడి ఒక శిలాఫలకమైన
వేయబోకుడు నేనట విశ్రమింప
పేరు ఊరును లేక ఆ ప్రేతభూమి
పడక వేసెద నా సొంత వలికి లోన

* * *

# English Poetry Serial -1

# DUSK AND DAWN

-Dr. Palvai (Kodur) Padma, M.D., (U.S.A.)

(Continued from the last issue)

## 10. The Lady of Sorrow

I saw her - The lady of sorrow
Tears in her eyes, moan in her voice
Desperation in her face, disgust in her gesture
She came along with my shadow
In every step I laid, in every work I undertook
I pleaded and begged her to leave me
But she followed me wherever I went
She discovered me wherever I hid
And she enclosed me in her shell
Lo! She ran away when I smiled at her.

## 11. The Reminiscence

It was she
An era of fabulous love in my life,
A fond memory of my innocence,
A magical symphony in my heart,
A passion of my life time,
A hypnotic melody of joy,
An ethereal angel of understanding,
A darling in the bossom of her heart,
An incarnation of inestimable affection.

I owe
But for her yearning heart
What was I? A flower with no fragrance;
But for her glorious love and affection
What was I? A desert with no oasis;

But for her guiding light
What was I? A traveller with no destination;
But for her radiant smile
What was my life? A barren field;

I acquiesce
A mesmorising chant you cast
As my frail heart leaps at your pleasant thought;
The smile of my life sparkles
When your rosy memories flow in;
My heavy heart, with tears, is flooded
Of anguish or elation I know not
For it is above all expression of my ignorant self;

I love thee
Worship I can't, for Almighty you are not,
Adore too, I can't, for you are not blemishless;
I know not, I yearn for you or
you chase my conscience
Yet, I am sure you are safe in my heart's vault
It is you my dear;
An indispensable elixir of my life.
Now
Whenever I try to imagine my-self without you
I feel lonely, dull, monotonous and gloomy;
Future seems disgusting
Without a hope of our meeting;
Even the loveliest rose does not attract me
Without your looks assuring;
My emotion wears out to a frazzle,
My heart chokes with tears,
With the reminiscence of our to-getherness;

I pine
Gone are those blissful moments of
our mutual love and respect,

Gone is that laughter and those tears of joy,
I sob my-self into an uneasy slumber many a night,
Yet, I live as a shadow of our glorious yester years
And I am a creature of hope and optimism.

*Note: This free verse is, perhaps about the poetess's reminiscence of her memorable association with one of her barracks mates when she was studying at K.R.C.R. Girls' School, Kittur, Karnataka on winning a Central Government scholarship for 1984 to 1988. I had an opportunity of meeting her in 1988 when I attended a function of passing out parade where the poetess was awarded a memento for the best outgoing student of that year. There I could observe the poetess's deep love and admiration to her.*

*- K. Pulla Reddy, father of the poetess*

**(to be continued in the next issue)**

* * *

## English Poetry Serial -2

# THE KING OF DARK CHAMBER

**-Dr. C. Satyanarayana, M.S. (ENT), Madras**

**(Continued from the last issue)**

### 5. Song of Cheer

My friend, today I sing the song of cheer
It is true, with a smile and a song
Life is like a bright sunny day
It is easy enough to be pleasant
When life flows like a song

I set out for the land of content
By gay crowded pleasure-highway
With all the travellers coming along
To find the land of content and peace
With laughter and fun I set out

Along mirth loving throng for a day -
On the way I met pilgrims returning
Who said "we are wearied and tired
but we found not the land of content"
And then I realised that I bad wandered astray.

Life and I are lovers then
At least friends we are now
Often like two children unwilling to separate
Sometimes life frowns at me
But we make up before the end of the day
And again I say unto him that I will leave him
For his rival death
Life becomes jealous, more jealous,
As all lovers do
And says - "why my friend why think of death.
Do a good deed a day
In which you live till eternity".

*(13th April 1997)*

## 6. The Microcosm

Neither Aught nor Nought existed
Time stood still
The Timeless
Who is ever wakeful in the Blissful Play of
Creation, Sustainence and Dissolution
Brought forth the ever expanding Universe.
The life giving sun, the energy spraying comets
The stars planets, wind water fire and all
Sprang from his Blissful Play,
The Macrocosm.
All the elements in his creation have
An order regular, moving in their Orbits

Emitting influence on each other
In a harmonious way.
I am
With all the elements of Macrocosm in me
An infinitismally small speck in His vast creation
But the lesser Gods of the spheres
Spread their Aura on me
Tossing me this way and that way
Causing endless misery

Let it be known
I am the one with all the elements of Macrocosm
I am the one with expanding Consciousness
The last but one of Perfection
The Microcosm

*(29th May 1997)*

***(to be continued in the next issue)***

* * *

## SO SAYS 'ADI STREE'

**-Nuggehalli Pankaja**

Shackled under
the guise
of being sheltered,

Bewildered wraths
rise up from ashes
of thoughts thrashed,
Desires smothered,
And alas,
Voices once powerful -

Now moulded to suit,
set rules of man supreme!

Visons of women,
Glorious once,
Blend with those
Sufferers mute
Haunting my soul
With this-this,
Single query,
"Is it our fault
To be born
Not as 'Boy'?
Tell us ..... Mata?"

But thou, my
Gifted daughter,
Truly hast thou shed light,
By this wreath of words.

I thank thee on behalf
Of all my offsprings

From days of 'Rishis',
To end of 'Yugas',
Flapping their wings
in mid-air,
'Whither? Whither? Whither?

*(Inspired by the award-winner book 'Dharma Shastragalu - Stree Shoshane' written by Dr. Nirupama, a famous Kannada writer, as well as Telugu).*

* * *

*"For what avail the plough or
sail or land or life, if freedom fail"*

**-Emerson**

## DIVINE GIFT

**-Lakshmi Kathyayini**

God, with his divine creation,
mastered a coveted delight
Grasping the human imagination
gifted an immortal beauty.

The protective cover of the Himalayas
soaked in the snowy softness,
the green blanket designed
with multi-coloured landscapes,
pessessing the freshness and pureness
of that of the morning dew,
lights a poet's desire
fusing with his wandering nature.

Man, engulfed by materialistic mind
indeed is blessed by divinity
gifted by escapism through the
channelised Nature, mothering
spirituality in its train.
God, chartering humanity towards reality.
creating a blissful world
is the ultimate solution
for this chaotic world.

* * *

## THE ANGEL

**-P. Sanjay**

I was in the world
filled with darkness and gloom,
She came like an angel
and made me bloom.

Her eyes are as bright
as thousand rays of the sun,
Every moment with her
is always cheerful and fun.

Her locks are like
a smooth flowing river,
Her thoughts are always
crystal clear.

Her foot steps are music
the rhythm divine,
She is much valuable to me
more than a gold mine.

In my dark world
she is my moon,
She is a cool shade
in a summer noon.

She is a person
dear to my heart
Sometimes she is sweet
Sometimes she is smart
People like her in this world are less
Who is she?
Guess?

* * *

## THE SMILING BUDDHA

-Kuldip Salil

When tanks and rockets and the bullets
Hit me even in stone and granite,
When fuming fury in a state of fit
Turns to use the dynamite,

When frenzy, violence, vengeful wrath
The proud progeny of Satan supreme
And their Kinsmen intolerance, hate
Howl and growl and loud scream
With all the self-righteous sounds,
I sit, as I did, under the Bodhi tree
Though distracted for a while
And, as is my wont, for centuries now
I quietly smile.
But oh! the hunger stalks the blighted land
And bitter chill rips the bones apart,
But oh! the children in their thousands die
And under their veils the women cry
And the powers that bred the Talibans
Now hypocritically sigh,
I must confess I am distraught,
Do I still smile?

*(Deccan Herald, Sunday, April 22, 2001, Delhi.)*

* * *

'చైతన్య కవిత' కవులకు, పాఠకులకు

## ఉగాది శుభాశంసనాలు

ఏమొ అనుకొంటి 'విక్రమ' యేగుదేర
అక్రమమెయయ్యె తనదైన విక్రమమ్ము
వేయి శుభముల నిడు మీకు 'విషు' ఉగాది
ఆయురారోగ్య భాగ్యమ్ము లమర మనుఁడు!

చెన్నై — ఆచార్య వి. రామచంద్ర చౌదరి
25-3-2001.

కవి ప్రపంచం:

# విపులాచ పృథ్వీ

(గత సంచిక తరువాయి)

-'సౌభాగ్య'

## 10. స్టీఫెన్ స్పెండర్
## (1909 - 1998)

స్టీఫెన్ స్పెండర్ 1909లో జన్మించాడు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో చదువుకున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధం నాటికి పసివాడు. యుద్ధాలు ఎందుకు చేస్తారో? అనుకునే వాడట. మనుషుల కన్నా జంతువులే నయం అనుకునే వాడట! స్పెండర్‌ది సున్నిత స్వభావం. పేదవాళ్ళ బాధలు చూసి చలించి పోయేవాడు. సామాజిక న్యాయం కోసం, సమానత్వం కోసం తహతహలాడాడు. చదువుకుంటున్న రోజుల్లోనే కమ్యూనిస్టు సిద్ధాంతంతో ఆకర్షింపబడ్డాడు. ఇలియట్, ఆడెన్, డేలూయీ వంటి కవుల స్నేహం సంపాదించాడు. వసుధైక కుటుంబం కోసం కలలు గన్నాడు.

స్పెండర్ మొదట ఇలియట్, హాప్‌కిన్స్‌ల కవితా రీతుల్ని అనుసరించాడు. యంత్రాల్లో కూడా కవిత్వాన్ని చూశాడు. మనోహరమైన పదచిత్రాల్ని సృష్టించాడు. స్పెయిన్ అంతర్యుద్ధంలో ప్రజాస్వామ్యవాదుల పక్షాన నిలబడ్డాడు. రెండో ప్రపంచ యుద్ధంలో రష్యా-జర్మనీ సంధితో ఆయన కమ్యూనిస్టు వ్యతిరేకిగా మారాడు. 'ది గాడ్ దట్ ఫెయిల్డ్' అన్న రచన చేశాడు. ఆయన రెండు సార్లు ఇండియా కూడా సందర్శించాడు. 'పోయమ్స్ ఇన్ న్యూ సిగ్నేచర్, 'డిస్ట్రక్టివ్ ఎలిమెంట్' ఆయన ఉత్తమ రచనలు. కథలు కూడా రాశాడు. ప్రపంచంలో ఎక్కడ ఏ దేశంలో జరిగినా అక్కడి ప్రజా వుద్యమాల్ని బలపరిచేవాడు.

''ఇక్కడ ఏ ఆత్మా విశ్రాంతిని కోరడం లేదు
ఇక్కడ ఏ మనిషీ ఆకలితో బాధపడకూడదు
మా లక్ష్యం అదే!
మనిషి మనిషిలాగా బ్రతకాలని నేను కోరుకుంటాను'' అన్నాడు

1942 'రూయిన్స్ అండ్ విజన్స్', 1962లో 'పోయమ్స్ ఆఫ్ డెడికేషన్' అనే సంపుటాలు తెచ్చాడు. తన కవితల్ని ఆయన 'ఆధ్యాత్మిక' అనుభవాలు అంటాడు.

స్పెండర్‌లో భౌతిక నాగరకత పట్ల విరక్తి కనిపిస్తుంది. ఆయన్లో నిరాశాలక్షణాలు కనిపిస్తాయి.

**'ఆత్మ విశ్వాసం, ఆదర్శం లేని ఆకాశం**
**శూన్యంతో నిండి ఉంది.**
**నమ్మకం ఇక్కడ నిస్పృహాయంగా నిలబడిపోయింది'** అంటాడు

యుద్ధం తాలూకూ నీలినీడలు ఆయన కవితల్లో కనిపిస్తాయి. ''మనుషులు నిష్ఫలంగా తమ ఇళ్ళలో మగ్గిపోతున్నారని, తమ తోటల్లో మంట లేసుకుని చలికాచుకుంటూ, జీవితాన్ని గురించి రంగురంగుల కలలు కంటూ వుంటారని, వున్నట్లుండి తుఫాన్లు విరుచుకుపడి, పిడుగులు పడి దృశ్యం మారిపోతుందని' అంటాడు.

ఆశలూ, నిరాశలూ రెండూ ఏక కాలంలో ఆయన కవితల్లో కనిపిస్తాయి.

**''ఈ యుగాన్ని దాటడానికి**
**తుపాకీ గుండుకున్న గుండెధైర్యం, దూసుకుపోయే వేగం కావాలి!**
**కానీ మన ప్రశ్నలకూ, సాహసాలకూ మృత్యువే సమాధాన మిస్తోంది!''**

నిరాశతో యుద్ధ భయంతో 1940 ప్రాంతాల్లో రాసిన గీతాలివి.

క్రమక్రమంగా ఆయన విధి బలీయమన్న నిర్ణయానికి వచ్చినట్లనిపిస్తుంది.

**''నవ్యత కోసం నేను అల్లాడడం లేదు**
**నన్ను నేను తెలుసుకునే ధైర్యంకోసం, జ్ఞానంకోసం విధిని ప్రార్థిస్తున్నాను''** అంటాడు. అస్పష్టమార్మిక వ్యక్తీకరణల కోసం ఆయన ఆరాట పడినట్లు తెలుస్తుంది. కవులు సాధారణంగా సుకుమారులు. స్పెండర్ మరింత సుకుమారుడు. ఆదర్శాల కోసం ఆనందగానం చేసిన హృదయం రెండో ప్రపంచ యుద్ధ బీభత్సంతో దిగాలు పడిపోయింది. తొలినాళ్ళ ఆత్మవిశ్వాసాన్ని, ఆశని ఆయన కోల్పోయాడు. 'ఆత్మశాంతి' కోసం తరువాతి రోజుల్లో అల్లాడాడు. ఆత్మవిమర్శలో మునిగి పోయాడు. **''నువ్వు పుట్టావు, చనిపోక తప్పదు!**
**నువ్వు ప్రేమించబడ్డావు! ప్రేమించక తప్పదు!''** వంటి భావాలతో కొంత తాత్విక ధోరణిలో గీతాలు రాశాడు. తొలినాటి భావావేశం వీటిల్లో లేదు. తాత్వికత మోతాదు మించితే, ఆలోచన్లు అజమాయిషీ చేస్తే కవిత్వానికి ఇబ్బంది తప్పదు.

తను ఆశించిన విప్లవం మానవ సమాజంలో రాలేదన్న నిస్పృహ ఆయన్లో కనిపిస్తుంది. 'మనం అనుకున్నవి జరిగి తీరాలని లేదు' అని ఆయన అనుకున్నట్లు కనిపించదు.

''విడిపోయిన మనం ఒక నమ్మకంతో కలిసిపోతాం!
కలిసి వున్నా మన పరిమితుల్తో కలత పడతాం
కానీ మన ఆదర్శాలు దుఃఖంతో చలించే
మన అంతర్నేత్రాల్ని అంధకారంలో ముంచాయి'' అంటాడు. ఇంకా

''మానవుల్తో దీర్ఘయుద్ధం చేస్తూ
నిరంతరం శ్రమిస్తూ నేను బలవంతుణ్ణవుతాను.
పర్వతాలు నన్ను చూసి వణకుతాయి
అప్పుడు నేను ఆనందంగా విశ్రమిస్తాను.
నా మనసును క్రమంగా నీరస పరుస్తూ, నాలోని కాంతిని కరిగిస్తూ
నత్తనడక నడిచే రోజుల్ని నేను వూహించ లేక పోయాను!
శరీరం, ఆత్మా గాలిలోని కాలుష్యంలా
నిర్జీవంగా వాలిపోతూ వుంటే
మళ్ళీ వాటిని పునరుజ్జీవింప జేసే మార్గమే కనిపించదు!'' అని దిగులు పడతాడు.

## 11. జోసెఫ్ బ్రాడ్‌స్కీ
## (1940 - 1997)

జోసెఫ్ బ్రాడ్‌స్కీ 1940లో లెనిన్‌గ్రాడ్‌లో యూదు దంపతులకు జన్మించాడు. 15 సంవత్సరాల వయసులో చదువు మానేశాడు. 1956లో హంగెరీ పోలెండ్ దేశాల్లో రష్యా ప్రభుత్వ సైనిక చర్యకు తీవ్రంగా స్పందించాడు. పోలిష్ భాషని నేర్చుకుని రెండేళ్ళకే ఆ భాషలో కవిత్వం రాశాడు. అనువాదకుడిగా పని చేశాడు. 1961 మొదలు అన్నా అక్మతోవా స్నేహితుడు. 1963లో 'సామాజిక వ్యతిరేక కార్య కలాపాల' వల్ల కమ్యూనిస్టు ప్రభుత్వం ఆయన్ని అరెస్టు చేసి, ఐదేళ్ళ జైలుశిక్ష విధించింది. లేబర్ క్యాంపులో 21 నెలలు నిర్బంధ శారీరక శ్రమ శిక్ష అనుభవించాడు. జైల్లో వున్న రోజుల్లో స్వయం శక్తితో ఇంగ్లీషు నేర్చుకుని ఈట్, ఇలియట్, ఆడెన్, డిలాన్ థామస్, వాలేస్ స్టీవెన్స్‌లని అధ్యయనం చేశాడు.

ఆయన కవి కావడం, నిర్బంధాన్ని అనుభవించడం వల్ల పాశ్చాత్య ప్రపంచంలో ప్రసిద్ధి పొందాడు. నవంబర్ 65లోనే విడుదలై లెనిన్‌గ్రాడ్ తిరిగి వచ్చాడు. ఐనా ఆయనపై

నిఘా కొనసాగింది. ఇతర దేశాల సాహిత్య సమావేశాల కోసం ఆహ్వానాలు వచ్చినా ప్రభుత్వం ఆయన్ని వెళ్ళడానికి అనుమతించలేదు. 1972లో దేశాన్ని విడిచి వెళ్ళాడు. మొదట కొంతకాలం వియన్నాలో, లండన్‌లో వున్నాక మిచ్‌గాన్ యూనివర్సిటీ ఆహ్వానంపై అమెరికా చేరాడు. కొలంబియా, న్యూయార్క్ విశ్వవిద్యాలయాల్లో అధ్యాపకుడిగా పనిచేశాడు. 1978లో ఏల్ యూనివర్సిటీ డాక్టరేట్ ఇచ్చి గౌరవించింది. కేంబ్రిడ్జి యూనివర్సిటీ కవితోత్సవానికి 1979లో ముఖ్య అతిథిగా ఆహ్వానింపబడ్డాడు. ఇంగ్లీషులోనూ, రష్యన్ భాషలోనూ కవిత్వం రాశాడు. నోబెల్ బహుమతి కూడా అందుకున్నాడు.

యువ్‌జినో యువ్‌టుషెంకో తరువాత పాశ్చాత్య ప్రపంచంపై ప్రభావం చూపిన రష్యన్ కవి బ్రాడ్‌స్కీ. రెండవ ప్రపంచ యుద్ధానంతర తరానికి చెందిన ప్రతిభావంతుడయిన కవి. కమ్యూనిస్టు రష్యాని విడిచి వెళ్ళినందుకు మాత్రమే కాక నిజమైన శక్తి సామర్థ్యాలున్న బహుముఖ ప్రజ్ఞాశాలిగా బ్రాడ్‌స్కీ కీర్తింపబడ్డాడు.

యూరప్‌లోని యూదు కుటుంబాలన్నిట్లాగే బ్రాడ్‌స్కీ కుటుంబం నిర్లక్ష్యానికి గురయింది. ప్రాచీన గ్రీకు, లాటిన్ కవిత్వాలు చదివి, ఆధిభౌతిక చింతన చేసి, భాషా సముద్రాల్ని ఈది, కవిత్వమే తన సమస్యలకు పరిష్కారంగా దర్శించాడు బ్రాడ్‌స్కీ. ఆయన అపార అధ్యయనాన్ని పరిశీలిస్తే మనం ఆశ్చర్యపోతాం. ఎందరో పాశ్చాత్యకవులపై ఆయన 'ఎలిజీ'లు రాశాడు. ఆయన కవితల్లో అడుగడుగునా బైబిల్ కొటేషన్లు కనిపిస్తాయి. 'జాన్ డాన్' (John Donn) మీద రాసిన స్మృతిగీతంలో ఆయన ఆధిభౌతిక దృష్టి మార్మికంగా మనల్ని తాకుతుంది.

> ''మన జీవితం పదిమందితో పంచుకోదగింది ఐనప్పటికీ
> మన మరణాన్ని పంచుకోవడానికి ఈ మహాప్రపంచంలో ఎవరూ తోడురారు!
> ఒక్కటే ఒక్కటి మాత్రమే దూరతీరాల గగనం మాత్రమే
> అనంతంగా వ్యాపించిన అంధకారంలో
> నక్షత్రాల చిరునవ్వుతో ఓదార్పు నిచ్చేది గగనం మాత్రమే!'' అంటాడు.

ఆకాశం నుంచి వర్షించే మంచు శరీరంలోకి, ఆత్మలోకి, భూమిలోకి, ఆకాశంపైకి అల్లుకుంటుందట! కవితని జీవించి వుండటానికి, జీవించి వున్నాననడానికి ఉపకరణంగా భావిస్తాడు బ్రాడ్‌స్కీ!

లేబర్‌క్యాంప్ లోని ఆయన అనుభవం బ్రతుకు పట్ల మమకారంగా ఆయన్లో పర్యవసించింది.

ఆయన కమ్యూనిస్టు రష్యా గురించి ఒకసారి చెబుతూ ''రష్యాలో జంతువెవరో, మనిషెవరో తెలుసుకోవడం అంత సులభం కాదు'' అన్నాడు. మొదట సత్యావిష్కరణ, తరువాతే బాధ' అన్నది ఆయన దృక్పథం.

> ''కళ పడే శ్రమ అంతా అబద్ధాల్ని చెప్పడానికి కాదు. దాని ప్రాథమిక సూత్రం నిస్సందేహంగా సత్యావిష్కరణని స్వతంత్రంగా నిర్వహించడమే'' అంటాడు.

రష్యానించీ వెళ్ళాకా ఆయన రాసిన కవితలో 'ప్రపంచం నించి ఎవడూ పలాయనం చెయ్యలేడు' అంటాడు.

''ఒక దేశాన్ని దాటి ఇంకో దేశం వెళ్ళినా
ఒక సముద్రాన్ని దాటి ఇంకో సముద్రం చేరినా
ఎక్కడికి వెళ్ళినా భూగోళమే కదా!
దీన్ని విడిచి ఎక్కడికయినా వెళ్ళడానికి ఏ దారీ లేదు నాకు!''

మనసు పొరల్లో దాగిన అజ్ఞాత ఏకాంత దుఃఖముంది ఈ కవితలో. 'ఏకాంతం అన్ని వస్తువుల అంతస్సారాన్ని మనకు అందిస్తుందంటాడు. 'నేను అన్నీ పోగొట్టుకున్నాను! కానీ నేను పోగొట్టుకున్న వన్నీ మళ్ళీ పొందాను!' అంటాడు చిత్రంగా. పై కవితలోనే

''సముద్రాల ద్వారా వ్యాపించిన నీరూ,
నీటిదాకా వచ్చి నిలిచిన నేలా
ఎక్కడయినా ఎక్కడ చూసినా అవే కదా!'' అంటాడు.

రష్యాని వదిలి వేళ్ళేముందు ఒక కవితలో అన్నట్లు 'స్వచ్ఛంగా తెల్లగా వున్న కాగితం ముందు వినమ్రంగా వొరిగి ఒక పదాన్ని సృష్టించు' అన్న మాటలకి ఆయన జీవితాంతం నిబద్ధుడయ్యాడు. తన కవితలో మానవత్వాన్ని పరిమళింప జేశాడు.

(సమాప్తం)

# సాహిత్య వార్తలు

సేకరణ: డా॥ దివాకర్ల రాజేశ్వరి
శ్రీమతి అంబికా అనంత్

## 1. తణుకులో 'తిలక్ సాహిత్య పరిషత్' స్థాపన

తణుకులో ప్రముఖకవి కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ (1921-1966) స్మారకంగా ''తిలక్ సాహిత్య పరిషత్'' అనే నూతన సాహిత్య, సాంస్కృతిక, అభ్యుదయ సంస్థ స్థాపించబడింది. దీనికి శ్రీ దేవరకొండ శివకుమార శాస్త్రిగారు గౌరవాధ్యక్షులుగాను, శ్రీ దేవరకొండ గంగాధర రామారావుగారు అధ్యక్షులుగాను, కవి శ్రీ మోహన ప్రసాద్ కార్యదర్శిగాను, శ్రీ జి.యల్.ఎన్. మూర్తి సహాయ కార్యదర్శిగాను నియమితులయ్యారు. ఈ సంస్థ ప్రారంభోత్సవం 22-11-1999 సోమవారం (గురు నానక్ జయంతి) నాడు సాయంత్రం 6 గంటలకు ఇటీవల తణుకులో నిర్మింపబడిన ''కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ మునిసిపల్ ఆడిటోరియం'' లో జరిగింది. తణుకు మునిసిపాలిటీ ఛైర్మన్ శ్రీ ఆకుల వెంకటేశ్వరరావు ముఖ్య అతిథిగాను, మునిసిపల్ కమీషనర్ శ్రీ గోరంట్ల వెంకట్రావు గౌరవ అతిథిగాను, ఆడిటర్ శ్రీ జె.ఎస్. సుబ్రహ్మణ్యం సభా ప్రారంభకులుగాను, శ్రీ సి.హెచ్.కె. విశ్వేశ్వరరావు, డా॥ అద్దేపల్లి రామమోహనరావు, డా॥ చందు సుబ్బారావు, డా॥ తాతిన రామబ్రహ్మం వక్తలుగాను ఈ పరిషత్ ప్రారంభోత్సవ సభలో పాల్గొన్నారు.

### కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ వంశవృక్షం

(తిలక్ తమ్ముడు శ్రీ డి. గంగాధర రామారావుగారు చెప్పిన ప్రకారం)

దేవరకొండవారు వెలనాటి బ్రాహ్మణులు. వీరిది హరితస గోత్రం. వీరి స్వగ్రామం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు తాలూకాలోని 'మండపాక' గ్రామం.

మూలపురుషుడు

I. ఎల్లప్ప (?)

|

II. కృష్ణప్ప (?)

కృష్ణప్ప (?)
|
III. అన్నప్ప
|
IV. సత్యనారాయణ మూర్తి, భార్య: రామసోదెమ్మ

వీరు తిలక్ తల్లిదండ్రులు. వీరికి ఐదుగురు కూతుళ్ళు, ఏడుగురు కొడుకులు. కొడుకులలో తిలక్ రెండవవారు; మొత్తం సంతానంలో ఆరవవారు. తిలక్ అన్నదమ్ములను అప్పచెల్లెండ్రను జ్యేష్ఠానుక్రమంగా తెలియజేస్తున్నాము:

1. సీతారత్నం - భర్త: ఈమని సీతయ్య
2. మాణిక్యాంబ - భర్త: కప్పగంతుల సూర్యనారాయణ (సూరయ్య); కూతురు: నరసమాంబ - ఈమె భర్త: ప్రసిద్ధ వైణికుడు ఈమని శంకరశాస్త్రిగారు.
3. అచ్యుతాంబ - భర్త: జయంతి దీక్షితులు (మానేపల్లి జమీందారు)
4. సూర్యకాంతం - భర్త: వేపా పూర్ణారావు. ఈయన పశ్చిమగోదావరి జిల్లాలో మొట్టమొదట ఎం.బి.బి.యస్. చదివిన డ్యాక్టరు.
5. (పెద్ద) అన్నప్ప
6. బాలగంగాధర తిలక్ (కవి) - భార్య: ఇందిరాదేవి
   - 6.1 కొడుకు: డా॥ సత్యనారాయణమూర్తి (ఇంగ్లండ్)
   - 6.2 కొడుకు: డా॥ సుబ్రహ్మణ్యం (అమెరికా)
   - 6.3 కూతురు: చంద్రలేఖ (అమెరికా)
7. శివకుమార శాస్త్రి (అడ్వకేట్, ఏలూరు).
8. ఎల్లా బాలాత్రిపుర సుందరి - భర్త: ఈమని సుబ్బరాయశాస్త్రి (ఇంజనీరు)
9. పార్థసారథి - (అడ్వకేట్, హైదరాబాదు)
10. గంగాధర రామారావు (అడ్వకేట్, తణుకు)
11. ధనంజయ
12. తిమ్మేశ్వరరావు

## 2. నన్నయ భట్టారక పీఠము - తిలక్ అవార్డు

కీ.శే. దేవరకొండ బాలగంగాధర తిలక్ శిష్యులైన డా॥ శ్రీపాద కృష్ణమూర్తి (గుమ్మలూరు, పోడూరు మండలం, పశ్చిమగోదావరి జిల్లా), ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు (బెంగుళూరు) కలిసి తణుకులోని నన్నయభట్టారక పీఠానికి 10 వేల రూపాయల విరాళమిచ్చారు. దీనిమీద వచ్చే వడ్డీతో ప్రతిసంవత్సరం ఆంధ్ర దేశంలోని ఒక ప్రముఖకవికి ''తిలక్ అవార్డు'' పేరుతో వేయి నూట పదహార్లు, శాలువా, జ్ఞాపిక ఇవ్వవలసిందిగా కోరారు. ఈ అవార్డు గత ఐదు సంవత్సరాలుగా ఇస్తూ వచ్చారు. ఈ సంవత్సరం (అంటే 2001లో) తిలక్ అవార్డును ప్రముఖ విప్లవ కవి శ్రీ కె. శివారెడ్డి (హైదరాబాదు) గారికి ఆగస్టు 15వ తేదీనాడు ఇస్తున్నారు. ఇంతకు పూర్వం ఈ అవార్డు పొందిన ప్రముఖ కవులు:

1. డాక్టర్ గుంటూరు శేషేంద్రశర్మ, హైదరాబాదు, 1997
2. శ్రీ మహమ్మద్ ఇస్మాయిల్, కాకినాడ, 1998
3. డా॥ ఆవంత్స సోమసుందర్, పిఠాపురం, 1999
4. శ్రీ కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, రాజమండ్రి, 2000

## 3. 'శ్రీరస' వారి సాహిత్య వసంతోత్సవాలు

### శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (శ్రీరస) వారి విషునామ సంవత్సర ఉగాది సాహిత్య వసంతోత్సవాలు

బెంగుళూరు లోని శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (శ్రీరస) వారు బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖవారి సహకారంతో మార్చి 25వ తేదీ ఉగాదినాడూ, తిరిగి ఏప్రిల్ 1వ తేదీ (శ్రీరామనవమి ముందురోజు)నాడూ సాహిత్య వసంతోత్సవాలు నిర్వహించారు. రెండు రోజులలో నాలుగు గొప్ప సాహిత్యోపన్యాసాలు ఏర్పాటు చేశారు.

**1. 25-3-2001 ఆదివారం సాయంత్రం 4.00 గంటలకు:**

''ధాన చింతామణి'' శ్రీ దళవాయి. కృష్ణస్వామి ఆదికేశవులుగారి షష్టిపూర్తి సంవత్సర సాహిత్యోపన్యాసం:

విషయం : ''నన్నయ్య భారతం''

వక్త : ఆచార్య శలాక రఘునాథ శర్మ, ఎం.ఏ; పిహెచ్.డి.
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

సౌజన్యం : శ్రీమతి డి.ఎ. తేజేశ్వరి -
శ్రీ కె.ఎం. శ్రీనివాసమూర్తి దంపతులు

2. **25-3-2001** ఆదివారం సాయంత్రం **5.30**గంటలకు:

స్వర్గీయ వి. నారాయణరావు ఐ.ఎ.యస్.గారి **69**వ జయంతి సాహిత్యోపన్యాసం

విషయం : ''పోతన భాగవతం''

వక్త : డా॥ ప్రొద్దుటూరి ఎల్లారెడ్డి, ఎం.ఏ., పిహెచ్.డి., మహబూబ్‌నగర్

సౌజన్యం : శ్రీమతి పి. లలితాంబిక -
శ్రీ పి.ఎస్. వి. అనంత నారాయణ దంపతులు

3. **1-4-2001** ఆదివారం సాయంత్రం **4.00**గంటలకు:

స్వర్గీయ సకలా రంగనాయకమ్మగారి స్మారక సాహిత్యోపన్యాసం

విషయం : ''రామాయణ వైభవం''

వక్త : ''కవిరాజ శేఖర'' శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి,
గామాలపాడు, పల్నాడు, గుంటూరు జిల్లా

సౌజన్యం : శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి, ప్రతిభా జ్యూయల్రీ, బెంగుళూరు.

4. **1-4-2001** ఆదివారం సాయంత్రం **5.30**గంటలకు:

''గురుజాడ గురుత్వాకర్షణ'' గ్రంథావిష్కరణ

గ్రంథకర్త మరియు ప్రముఖ అభ్యుదయ కవి, విమర్శకుడు
ముఖ్యఅతిథి : డా॥ ఆవంత్స సోమసుందర్,
పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా.

ఆవిష్కర్త : ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

కృతి స్వీకారం : శ్రీమతి నిడమర్తి శ్యామలాదేవి -
శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు దంపతులు
(తమ ఏకైక పుత్రిక స్వర్గీయ భోగరాజు మాధవి పరంగా)

గ్రంథ పరిచయం : ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి,
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం.

సౌజన్యం : శ్రీమతి కలవచర్ల భారతి -
శ్రీ కలవచర్ల గోపాలకృష్ణమూర్తి దంపతులు
మేసన్ నెట్‌వర్క్స్ ప్రైవేట్ లిమిటెడ్, బెంగుళూరు.

ఈ సందర్భంగా డా॥ ఆవంత్స సోమసుందర్‌గారు రచించిన మరొక ఆధునిక సాహిత్య విమర్శగ్రంథం ''కవితా కల్పవల్లి''ని శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావుగారు ఆవిష్కరించారు. శ్రీ వెల్దుర్తి హర్షవర్ధన్‌గారు ఈ గ్రంథాన్ని సభకు పరిచయం చేశారు. అలాగే శ్రీ చిలకల వెంకట సుబ్బారెడ్డిగారు రచించిన ''శ్రీరాముడు - శ్రీకృష్ణుడు: సంక్షిప్త తులనాత్మక పరిశీలన'' అనే చిన్న పుస్తకాన్ని ''కవిరాజశేఖర'' శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు ఆవిష్కరించి, సమీక్షించారు.

ప్రముఖ రంగస్థల నటులూ, సంగీత విద్వాంసులూ, సాహిత్య ప్రియులూ అయిన శ్రీదర్శి లక్ష్మీ వేంకటేశ్వర వరప్రసాదరావు పంతులుగారి ప్రార్థనతోనూ; ఆంధ్రప్రదేశ్ విమెన్ వెల్ఫేర్ డిపార్టుమెంటులో అసిస్టెంట్ డైరెక్టరుగా పనిచేసిన శ్రీమతి నంబూరి పరిపూర్ణగారి దేశభక్తి గీతాలతోనూ సభలు ప్రారంభమయ్యాయి. బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షురాలైన డా॥ చన్నాప్రగడ జయలక్ష్మిగారు కవి పండితులకు స్వాగతం పలికారు. ప్రముఖ జానపద సాహిత్యవేత్త, బెంగుళూరు విశ్వవిద్యాలయం తెలుగు శాఖ సంస్థాపకులు, పూర్వ అధ్యక్షులు 'చైతన్య కవిత' సంపాదకులు అయిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు సభలన్నింటికీ అధ్యక్షత వహించి చక్కగా సమర్థవంతంగా నిర్వహించారు. శ్రీరసవారు కవి పండితులను దుశ్శాలువలతో సత్కరించారు. కార్యదర్శి అయిన శ్రీమతి అంబికా అనంత్‌గారి వందన సమర్పణతో సభలు జయప్రదంగా ముగిసాయి.

ఈ విధంగా రెండు దినాలలో జరిగిన నాలుగు సాహిత్య సభలూ బెంగుళూరు విశ్వవిద్యాలయం వారి సెంట్రల్ కాలేజీలోని సెనేట్ హాలులో అతి వైభవంగా నిర్వహింపబడ్డాయి. బెంగుళూరులోని తెలుగు సాహిత్య రసికుల్ని అలరింప జేశాయి.

ఈ సాహిత్య వసంతోత్సవాల ఆహ్వానాన్ని అందుకున్న ప్రముఖ పండిత కవి, నంద్యాలలోని ''పింగళి సూరన సారస్వత సంఘం'' ప్రధాన కార్యదర్శి అయిన శ్రీ జి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ''వృషసాహిత్యాశంస'', ''సాహిత్య వసంతోత్సవ సంరంభ మాలిక'' అనే రెండు కవితలు పంపించారు. వాటిని ఈ సంచికలో ముద్రించాం. శాస్త్రిగారికి మా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం

**రాజేశ్వరి, అంబిక**
కార్యదర్శులు, శ్రీరస

# వృష సాహిత్యాశంస!

**-జి. సుబ్రహ్మణ్యశాస్త్రి**

దానచింతామణి 'దళవాయి కృష్ణయ్య'
నన్నయ భారతానందు డగుత!
స్వర్గీయ 'శ్రీరావు' స్వాంతమ్ము పోతన
భాగవతార్థ ప్రవర్త మగుత!
కవిరాజశేఖర ఖ్యాత 'చిట్టిప్రోలు'
రామాయణము 'సకలాప్త' మగుత!
'ఆవంత్స' 'గురజాడ' ఆ గురుత్వాకర్ష
ణము 'నిడమర్తి' గుణాత్మ మగుత!

'తంగిరాల' వారి తరగని సాహిత్య
సేవ- ఘన 'శలాక' సిడము కాంతి -
పరగుగాత 'రాచపాళెమ్ము' వరకును
వి'జయ' రాజ 'లక్ష్మి' వీక్ష కలన!

'ఎల్ల'లను దాట 'ప్రొద్దుటూ' రిల్లు దాకి!
రంగనాయక 'రాజేశ్వరాంబికా' ది
దేవతా కటాక్షమ్ముల దీప్తి సోకి
'శ్రీరస' వసంత సాహిత్య శీకరములు
తెలుగు హృదయాల కొరతల దీర్చు గాక!

# సాహిత్య వసంతోత్సవ సంరంభ మాలిక

-జి. సుబ్రహ్మణ్యశాస్త్రి

ఉల్లములెల్ల పెల్లుగ మహోల్లసితప్రభ రంజిలంగ; సం
ఫుల్ల లతాంత బృందగత పూర్ణమరంద సుగంధ బిందు సం
పల్లలిత ప్రవాహ మధుపమ్ముల ఝంకృతు లుల్లసిల్ల, వి
ద్యుల్లతికాంత సర్ప చలనోజ్జ్వల దీప్త విశిష్ట ఖేలనా
వల్లరి 'వర్ణరంజిత' విభావసువై ప్రభవింప, కోకిలా
సల్లప మంబరంబున ప్రశస్తగతిన్ నినదించినట్లు, వి
ద్వల్లలితాస్యమండల సుధాకలశోద్భవ శబ్ద భంగముల్
జల్లుగ దూకగావలె; ప్రజాహృదయాంబర వీథులన్ని రం
జిల్లవలెన్ కవిత్వ మధుసేచనతో; ధిషణామరేంద్ర మే
ధోల్లసిత ప్రవాచక సితోదకమండల వారిధార లు
ల్లోల దహీన లాహిరుల లోలుపులై విను శ్రోతలందరన్
పెల్లుగ ముంచగావలెను; పేరు గడించిన పండితోత్తముల్
మల్లు రుపన్యసించుటను మాన్య కవీంద్రు లపార శాస్త్రవిత్
వేల్లిత వార్నిధుల్ సభల దేల్చగ, వాగ్విభవమ్మునందు కో
కొల్లగ జూప శ్రోతృజన కోహలులందరు సంబరంబునం
దుల్లములెల్ల నూయెల లహోయని బాగుగ నూగగా వలెన్
ఎల్లలులేని సంతస మదెల్ల 'వసంత మహోత్సవంబునన్'
మొల్లలు మల్లెలై పరచి మోదము నిమ్ముల నింపగావలెన్
కల్లలు గావు నూతన యుగాది విశిష్ట విశేష పర్వ ని
త్యోల్లసన ప్రభా విభావములు, 'తోయజ లోచన' లందియిచ్చు నా
పుల్లయు చేదునౌ రసము బొక్కిన రీతి సమత్వ మాధురీ
పల్లకి పాటలన్ జిలుకు భాతి, వసంత జయంత కంతులున్
మెల్లన సాహితీవిభుల మేలికవిత్వ 'మధువ్రతంబునన్'
అల్లన చోటు చేసికొని యా 'మధుపానము' గ్రోలగావలెన్
చల్లని కావ్యభావ రససార సమంచిత శీకరమ్ము లె
ల్లల్లెడ సాగి సోకి లవలీ సురభి ప్రసర ప్రసార సం
ఫుల్ల జనాంతరంగ రసపూర్ణములై వెలుగొందగావలెన్!

## 4. డా॥ ఎన్. గోపిగారికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి

ప్రముఖకవి, విమర్శకుడు, పరిశోధకుడు, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు అయిన డా॥ ఎన్.గోపిగారు రచించిన ''కాలాన్ని నిద్రపోనివ్వను'' అనే కవితా సంపుటికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి వచ్చింది. గోపిగారిని చైతన్య కవిత అభినందిస్తోంది. వీరు ఇటీవల ''చుట్టకుదురు'' అనే నూతన కవితా సంపుటిని వెలువరించారు.

## 5. శ్రీ ''పఠాభి'' గారికి సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవం

ప్రసిద్ధ కవి, ప్రయోగశీలి, చలన చిత్రదర్శకుడు, నిర్మాత అయిన శ్రీ తిక్కవరపు పట్టాభిరామరెడ్డి (పఠాభి) గారికి 19-2-2001 నాటికి 82 సంవత్సరాలు నిండాయి. వీరి సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవాన్ని మైసూరుకు సమీపంలో గుండ్లుపేట దగ్గర ఉన్న గోపాలస్వామి కొండమీద శ్రీ హిమవద్గోపాలస్వామి సన్నిధిలో బంధుమిత్రులు నిరాడంబరంగా జరిపారు. చైతన్య కవితావేదిక గౌరవాధ్యక్షులైన ''పఠాభి'' గారిని అభినందిస్తున్నాము.

## 6. 'డా॥ సి. నారాయణరెడ్డి సమగ్ర సాహిత్యం' - 17, 18 సంపుటాలు

ప్రముఖ కవి, మధుర మనస్వి, అద్భుత వచస్వి, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, పద్మభూషణ బిరుదాంకితులు, రాజ్యసభ సభ్యులు అయిన డా॥ సి. నారాయణ రెడ్డిగారి సమగ్ర సాహిత్యం 17, 18 సంపుటాలు, జూన్ 30వ తేదీ శనివారంనాడు, బెంగుళూరులోని చౌడయ్య మెమోరియల్ హాలులో జరిగిన ఒక అద్భుతమైన సభలో, కర్ణాటక రాష్ట్ర గవర్నరు గౌరవనీయులు శ్రీమతి వి.యస్. రమాదేవిగారు ఆవిష్కరించారు. 17వ సంపుటం తొలిప్రతిని బెంగుళూరులోని ప్రముఖ కంట్రాక్టరు, ఏట్రియా హోటల్ అధినేత శ్రీ ఎ.ఎస్.చినస్వామి రాజుగారు స్వీకరించారు. 18వ సంపుటం తొలిప్రతిని బెంగుళూరులోని ప్రముఖ పారిశ్రామికవేత్త, శ్రీనివాసా ట్రస్టు అధినేత, ''దాన చింతామణి'' శ్రీ డి.కె. ఆదికేశవులుగారు స్వీకరించారు. వీరు ఈ సంపుటాలకు ఆర్థిక సహకారం అందించిన వదాన్యులు. బెంగుళూరు విశ్వవిద్యాలయం పూర్వ ఆంధ్ర శాఖాధ్యక్షులు, 'చైతన్య కవిత' సంపాదకులు అయిన ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు ఈ సంపుటాలను సభకు పరిచయం చేశారు. నారాయణరెడ్డి గారు తమ కవితాగానంతో సభను ఉర్రూతలూగించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి అంతర్జాతీయ తెలుగు సలహామండలి అధ్యక్షులు, బెంగుళూరులోని 'తెలుగు విజ్ఞాన సమితి అధ్యక్షులు, కర్ణాటక తెలుగు అకాడమీ అధ్యక్షులు అయిన శ్రీ అల్లూరి రాధాకృష్ణరాజుగారు ఈ గ్రంథావిష్కరణ సభకు అధ్యక్షత వహించారు. ఈ అకాడమీ కార్యదర్శి శ్రీ తోట వీర్రాజుగారు సభకు స్వాగతం పలికారు. ఉపాధ్యక్షులు శ్రీ సి.వి. శ్రీనివాసయ్యగారి వందన సమర్పణతో సభ ముగిసింది.



'గోదావరి కవితాఝరి'

శ్రీ అల్లంరాజు కామేశ్వరశర్మ ('కాసు')

కేశనకుర్రు, తూర్పు గోదావరి జిల్లా

# చైత్రకోకిల

విషు (వృష) వసంతం - **April 2001**



చైతన్య కవితా వేదిక. బెంగుళూరు